Regd. No. H.N.L. 18

30-4-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి: 64 సంచిక : 17 వెల: రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట రామానాయుడు

**అభీష్టానుసారం అభ్యర్థులు, అధికారుల బదలీలతో మార్పుకు శ్రీకారం**

## త్వరలో నిజ రూపం?

కోవూరు, కైకలూరు ఉపఎన్నిక స్థానాలకు తన అభీష్టాను సారం అభ్యర్థులను ఎంపిక చేయించ గలడం ద్వారా ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి పార్టీ పైన తనకున్న పట్టును మరొకసారి రుజావు చేసుకున్నారు. కైకలూరులో బాపిరాజు సహకారం లేకుండా గెలవడం కష్టమని అందరూ హెచ్చరికలు చేసినా ఆయన విన్పించుకోలేదు. బాపిరాజు సతీమణికి టిక్కెట్ ఇవ్వడానికి సుతరామూ అంగీకరించలేదు. అయితే అభ్యర్థి ఎంపిక

### రాజధాని రాజకీయం

తర్వాత బాపిరాజు మెడలు వంచి పనిచేయించడంలో మాత్రం ముఖ్యమంత్రి కృతకృత్యుడు కాగలిగారు. ఒక దశలో బాపిరాజు స్వతంత్రుడిగా రంగంలో దిగడానికి సిద్ధపడ్డారట. కాని, ఆ పొరపాటు చేస్తే రాజకీయ భవిష్యత్ అనేదే లేకుండా చేస్తానని, పై ఎన్నికలలో టికెట్ అడిగే పనే వుండదని ముఖ్యమంత్రి హెచ్చరించడంతో ఆయన సర్దుకొని, మనసు కష్టంగా వున్నా – కాంగ్రెస్ అభ్యర్థికి సహకార మందిస్తున్నారు. జస్టిస్ ఆంజనేయులు కమీషన్ ఫలితం ఎట్లా వుంటుందో నన్న భయమే ఆయన సర్దుబాటుకు కారణం. అయితే అసలు బాపిరాజు పై ముఖ్యమంత్రి ఇంత పట్టుపట్టి కక్ష సాధించడానికి కారణమేమి టన్నది మాత్రం తెలియదు.

కోవూరుకు సంబంధించి. పెళ్లకూరు రామచంద్రా రెడ్డి అభ్యర్థిత్వం విషయంలో విజయ భాస్కర రెడ్డి చాలా కాలం నుంచే ఒక నిర్ణయానికి వచ్చారని వినికిడి. ఏప్రెల్ ప్రథమ వారంలోనే డాక్టర్ వై.ఎస్.తో ఆయన సంగతి చెప్పారట. కానీ ఆ విషయం బయటకు పొక్కనివ్వకుండా జాగ్రత్త పడి, అందరికీ ఆశపెట్టి, ఆశాభంగం కల్పించి వినోదించారు. ఈ రెండు స్థానాలలోను విజయం సాధించ గల్గితే ముఖ్యమంత్రి ప్రతిష్ఠ పెరుగుతుంది. ఎదురు చెప్పే వారు లేకుండా పోతారు. మంత్రి వర్గ విస్తరణను వాయిదా వేయడానికి కూడా అదే కారణం. 19 తేది తర్వాత జరబోయే విస్తరణలో ముఖ్యమంత్రి కొన్ని కఠిన నిర్ణయాలు తీసుకుంటారని భావింప బడుతున్నది. రాజకీయంగా తన సమర్థతను, బలాన్ని లోకానికి ప్రదర్శించ డానికి ఆయన మంత్రి వర్గ మార్పులను ఒక అవకాశంగా వాడుకో నున్నారు. ఈలోగా అధికారుల బదలీల పై దృష్టి సారిస్తున్నారు. జిల్లాస్థాయి నుంచి సెక్రటేరియట్ వరకు ఐఎఎస్, ఐపిఎస్ అధికారుల నందరినీ తారు మారు చేసి, ప్రభుత్వ యంత్రాంగం పై పట్టు సాధించాలన్నది ఆయన తలంపు. రాజకీయంగా ఎంత దబాయింపు సాగించినా, అధికార యంత్రాంగం పై అదుపు, వారి నుంచి సహకారం లేకుంటే తాను ముఖ్యమంత్రిగా సఫలీకృతుడ్ని కాలేనని ఆయనకు అర్థమైంది. అందువల్లే తన చెప్పు చేతల్లో వుండే వారిని కీలక స్థానాలలో నియమించడానికి ప్రయత్నిస్తున్నారు. ఉపఎన్నికలలోగా ఈ తతంగం పూర్తి చేస్తే, 19 తేది కాగానే మంత్రులను మార్చ వచ్చునన్నది ఆయన తలంపు.

### ఎన్నికలు హుళక్కే?

వచ్చే జూన్ 30 తేదీలోగా రాష్ట్రంలో స్థానిక సంస్థలకు ఎన్నికలు జరపాలని హై కోర్టు ఇచ్చిన తీర్పు పై రాష్ట్ర ప్రభుత్వం సుప్రీం కోర్టుకు వెళ్ల నుంది. రాష్ట్రంలో మునిసిపాలిటీలకు, గ్రామ పంచాయితీలు, మండలాలు, జిల్లా పరిషత్‌లకు జరగాల్సి వున్న ఎన్నికల్ని రాష్ట్ర ప్రభుత్వం వాయిదా వేస్తూ వస్తోంది. కేంద్ర ప్రభుత్వం మున్సిపల్, పంచాయితీల చట్టాల్ని సవరించ నున్న దృష్ట్యా ఆ మేరకు రాష్ట్రంలో కూడా చట్టాల్ని సవరించాల్సి వుంటుందని, కాబట్టి స్థానిక సంస్థల ఎన్నికలకు మరికొంత వ్యవధి అవసరమని రాష్ట్ర ప్రభుత్వం కోరుతున్నది. రాష్ట్రంలో స్థానిక సంస్థల ఎన్నికలు జరిపించడానికి కాంగ్రెస్ పార్టీ సిద్ధంగా లేక పోవడం కూడా ఎన్నికల వాయిదాకు మరో కారణం.

## 'తులసి' మొక్క

రాష్ట్ర కాంగ్రెస్ పార్టీలో గూండాలు, సారా కాంట్రాక్టర్లు పెరిగి పోతున్నారని సాక్షాత్తు పి.సి.సి. అధ్యక్షుడు మట్టి తులసీదాస్ సెలవిచ్చారు. పార్టీలో రాను రాను గూండా శక్తులు పెరిగి పోతున్నాయని ఆయన ఆవేదన వ్యక్తం చేసి రాష్ట్ర కాంగ్రెస్ నాయకుల్ని దిగ్భ్రాంతికి గురిచేశారు. పార్టీలో నిజాన్ని నిర్భయంగా చెప్పగలిగేది తానొక్కడినేనని ఆయన తనకు తాను కితాబు పుచ్చుకున్నారు. రాష్ట్ర కాంగ్రెస్ అంతా గంజాయి వనమైతే పిసిసి అధ్యక్షుడొక్కరే ''తులసి'' మొక్కన్నమాట.

### ఎన్టీఆర్‌కు గండం తప్పింది

తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు శ్రీ ఎన్టీ రామారావుకు త్రుటిలో గండం తప్పింది. ఈ నెల 21 తేదిన ఆయనకు ఉన్న పళంగా బీపీ ఎక్కువై పక్షవాత లక్షణాలు కనిపించటంతో నగరంలోని నిజాం వైద్యశాలలో చేర్పించారు. అదృష్టం కొద్దీ ఎన్టీఆర్ త్వరలోనే కోలుకోవటంతో పక్షవాత గండం తప్పింది. ఆయన ఇప్పుడు కులాసాగా, మునుపటి మాదిరిగానే పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొంటున్నారు. ఇది జరిగిన రెండో రోజునే ఆయన నటించిన మేజర్ చంద్రకాంత్ చిత్రం విడుదలై 'హిట్' అవడంతో ఆయన అభిమానులు వేలాదిగా వచ్చి రామారావును అభినందిస్తున్నారు. ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి కూడా రామారావు నివాసానికి వెళ్లి పరామర్శించి వచ్చారు.

### హెచ్‌కె బాబు సుస్తి

కారు ప్రమాదానికి గురైన సీనియర్ ఐఎఎస్ అధికారి శ్రీ హెచ్ కె బాబు ఇంకా కోలుకోలేకున్నారు. ఆస్పత్రి నుంచి ఇప్పటికీ డిశ్చార్జ్ చేయలేదు. గాయాలు మానినా శారీరకంగా . మానసికంగా పూర్తి స్వస్థత చేకూరడానికి చాలాకాలం పట్టవచ్చునని భావిస్తున్నారు. అవినీతి ఆరోపణలు, అక్రమ సంబంధాల అగుడు, సస్పెన్షన్‌ల బాధతో అసలే క్రుంగిపోయి వున్న బాబుకి ఈ ప్రమాదం ఇంకా పెద్ద షాక్!.

# పెళ్లకూరు నామినేషన్ విధానం బెట్టిదనిన....

కోవూరు శాసన సభా స్థానానికి కాంగ్రెస్ అభ్యర్థిగా శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి 26 తేది మిట్ట మధ్యాహ్నం ఒంటి గంట పది నిముషాలకు సుముహూర్తం చూసుకొని నామినేషన్ వేశారు. శ్రీ కాటంరెడ్డి వెంకట్రామ రెడ్డి, శ్రీ సామంతు సుబ్బారెడ్డి, శ్రీ బైనా రమణయ్య ఆయన నామినేషన్‌ను ప్రతిపాదించారు.

పెళ్లకూరు నామినేషన్ తతంగం, జిల్లా కాంగ్రెస్‌లో ఆయన అభ్యర్థిత్వం పట్ల వ్యక్తమైన ఏకాభిప్రాయానికి విరుద్ధంగా వుండింది. జిల్లా నాయకులందరూ ఒక్కరు తప్పి పోకుండా హాజరు వేసుకున్నారు. ఎవరూ పిలవకుండానే కార్యకర్తలూ చెప్పుకోదగిన సంఖ్యలో తరలి వచ్చారు. ఎమ్మార్వో కార్యాలయం కిటకిట లాడ లేదు కాని, కలకలంగానే వుండింది. ఢిల్లీ నుండి ఏరొపెకిన బయల్దేరి వచ్చిన పెళ్లకూరును శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి, మంత్రి శ్రీ పసల పెంచలయ్య తమ మధ్య జాగ్రత్తగా కూర్చో బెట్టుకొని తీసుకొని వచ్చారు. కాంగ్రెస్ పట్ల భక్తితో పిలవకుండానే వచ్చి, ఎర్రటి ఎండలో చెట్ల నీడన ఆపసోపాలు పడుతుండిన కార్యకర్తలను పెళ్లకూరు పేరు పేరునా పలుకరించారు. ముహూర్తం టైం దాటి పోతున్నదన్న హెచ్చరిక రావడంతో రిటర్నింగ్ అధికారి గదిలోకి అతి కష్టం మీద పరుగు పెట్టారు రామచంద్రా రెడ్డి.

మా ప్రత్యేక విలేఖరి

సంఖ్య తక్కువైనా వచ్చిన వారంతా అభిమానులు కావడంతో అభినందనల వర్షం కురిపించే సరికి పాపమాయన నలిగి పోయారు. వేమారెడ్డి రామచంద్రా రెడ్డి చేతికి తెచ్చిన నామినేషన్ పత్రాల పై సంతకం పెట్టి, కలిసి వచ్చే చెయ్యిగా భావించబడే మాగుంట చేతుల మీదుగా ధరావత్తు సొమ్మును ఎలక్షనాఫీసరుకు అందించారు. నామినేషన్‌కు అందరూ వచ్చారనేందుకు సాక్ష్యముండాలని కాబోలు, ఏస్ శ్రీ సి.వి. శేషారెడ్డి గ్రూప్ ఫోటోకు రెడీ చేశారు. కావలి ఎమ్మెల్యే యానాది రెడ్డి గారు అలవాటులో పొరపాటుగా అక్కడ నుంచి జారుకోబోయే సరికి, నాయకులంతా 'యానాది బావ'ను వదిసి పట్టుకొని, మధ్యలో నిలేశారు. నాది ఫోటోజెనిక్ ఫేస్ కాదయ్యా బాబో అని మొరపెట్టుకున్నా విన్పించుకో లేదివ్వరూ! బావగారి జోకులతో ఫోటో నిండా ముఖాలబదులు పళ్లు మాత్రం కన్పించి వుంటాయి. నామినేషన్ టైంలో నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి అభిమాన బృందం ఆయన్ను జిందాబాద్ నినాదాలతో హోరెత్తించడంతో, కొంపదీసి నువ్వే నామినేషన్ వేస్తావేమిటయ్యా అని మాగుంట చలోక్తి విసిరి, నినాదాలకు ఫుల్ స్టాప్ పెట్టించారు. వచ్చిన జనం వాకిట్లో నిల్చోవడంతో లోపల గాలీ లేదు, వెలుతురూ లేదు. ఆ చీకట్లో పెళ్లకూరుకు ప్రమాణ పత్రం కన్పడక పోయే సరికి, చెన్నారెడ్డి పెంచల రెడ్డి ప్రాంటింగ్‌తో చదివానన్పించారు.

* పెళ్లకూరు 20 వేల మెజారిటీతో ఢంకా బజాయించి గెలుస్తాడు!

— మంత్రి పెంచలయ్య

* కోవూరు ఎన్నిక ద్వారా జిల్లా రాజకీయాల్లో ప్రత్యక్షంగా ప్రవేశిస్తున్నాను

— మాగుంట సుబ్బరామ రెడ్డి

* పదవుల కోసం పార్టీలు మార్చే వారిని మట్టు పెట్టాలి!

— సి.వి. శేషారెడ్డి

* పెళ్లకూరు అభ్యర్థి అని ముందే ప్రకటించి వుంటే గొడవలుండేవి కావు!

— కలికి యానాదిరెడ్డి

* నన్ను జైలు నుంచి విముక్తి చేసిన పెళ్లకూరు కోసం పనిచేస్తాను

— రావుల అంకయ్య గౌడ్

* ప్రధాని ఆదేశాల మేరకే పోటీ చేస్తున్నా

— పెళ్లకూరు

## పినాకిని తీరం

### "ఏమి చెప్పుదు...."!

జరిగింది చెప్పడానికి నోరాడక సంజయుడు ధృతరాష్ట్రునితో ఏమి చెప్పుదు అంటూ నీళ్లు నమిలాడట. అదే విధంగా కోవూరు కాంగ్రెస్ అభ్యర్థిత్వం విషయంలో కలం పెట్టాలంటే గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లుగా వుంది. సంజయుడు సరే కురునాధుణ్ణి సంబోధించాడు. నేనెవరికి చెప్పేది – నా రాజాలు పాఠకులే గదా!

పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి అభ్యర్థిత్వం పట్ల కొందరికి సంభ్రమాశ్చర్యాలు కలిగితే, కొందరు ముక్కు మీద వ్రేలేసుకుంటున్నారు. అభ్యర్థిత్వానికి అనర్హుడని కాదు, గెలువ లేడనీ కాదు. పదేళ్ల నుండి రాజకీయాలకు దూరంగా వుంటూ, దేశ స్థాయి పదవి 'అఫ్కో ఛైర్మన్' గా హస్తినా పురిలో వుండడమే గాక, విశ్వ విహారం చేస్తూ హాయిగా వున్న రామచంద్రా రెడ్డి గారు ఈ చిన్న పదవికి అభ్యర్థి అవుతారని కోవూరు నియోజక వర్గం ప్రజలు కలలో కూడా వూహించలేదు. అందువల్లనే ఆఖరు క్షణంలో అభ్యర్థి రామచంద్రా రెడ్డి గారనేసరికి వారికి నమ్మశక్యం కావడం లేదు, మ్రింగుడు పడడం లేదు; నిజం చెప్పాలంటే కలా మాయా అనిపిస్తున్నది.

పెళ్లకూరు అభ్యర్థిత్వం జిల్లా వాసులకు కొత్త కావచ్చు గాని కొందరు స్థానిక ఖద్దరు స్వాములకు తెలిసిందే; మా వూహకు సరేసరి అనుకోండి! 9 తేది కోవూరు అభ్యర్థుల సమీక్షలో వ్రాయబడిన మా మాటలు చదవండి -

"పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి అభ్యర్థిత్వం మీద పెక్కుమంది దృష్టి వుంది. అనారోగ్యం, వయస్సు ప్రతికూలతల సంగతి అటుంచి, చేతిలో వున్న బంగారం వంటి పదవిని వదలిపెట్టి, ఈ నడమంత్రపు పదవి కోసం వాళ్లు ఎందుకు హూనం చేసుకోవాలి అనే ప్రశ్న ఒకటుంది. ఆయన్నడిగితే తాను పోటీ చేయను అని స్పష్టంగా చెప్పారు. అవి పైకి చెప్పే మాటలే అని కొందరంటారు. కాని మేమలా అనుకోవడం లేదు. అర్హత సంగతికి వస్తే మునలిదైనా గెలువగలిగిన గుర్రమనే చెప్పి తీరాలి!"

అప్పుడే అక్కడ ఆయనలో ఆసక్తి, ఇక్కడ కొందరిలో ఆయనను

కొరవ 13 పేజిలో

# జమీన్‌రైతు

## భారమైన టెలిఫోన్లు

ఉన్నట్లుండి టెలిఫోన్ రేట్లను పెంచి ప్రజలకు బడిత పూజ చేసింది కేంద్ర ప్రభుత్వం. పెంపకమూ అంతింతకాదు – గ్రుడ్లు తిరిగేంత. 30 వేల లైన్లు దాటిన నగరాలలో టెలిఫోన్ బాదుగ 10 శాతం పెరుగుతుంది. ఉచిత కాల్స్ సంఖ్య 150 నుంచి 120 కి తగ్గించారు. ఇది మాత్రం 1000 లైన్లు దాటిన, నెల్లూరు వంటి చిన్న పట్టణాలకు కూడా వర్తిస్తుంది. కాల్స్ ధరలు 13 నుంచి 27 శాతం పెరిగాయి. మొదటి వెయ్యి కాల్స్‌కు 80 పైసల నుంచి రూపాయికి, రెండు వేల కాల్స్ వరకు రూపాయి నుంచి రూపాయి పావలాకు, రెండు వేల కాల్స్ దాటిన తర్వాత రు 1.10 ల నుంచి రు. 1.40 లకు పెంచారు. ఎస్.టి.డి వాడే వినియోగదారులకు రెండు వేల కాల్స్ వాలా త్వరగా దాటి పోతాయి. టెలిఫోన్ తాకితే దాదాపు రూపాయిన్నర ఖర్చు అంటే మాటలా? ట్రంకాల్స్ ధరలూ విపరీతంగా పెంచి వేశారు.

ఈ పెంపకం ద్వారా 1050 కోట్లు అదనపు ఆదాయం మాత్రమే వస్తుందని మంత్రి చెప్పినా, వాస్తవంలో అంతకు రెట్టింపు ఆదాయం పెరుగుతుందని అంచనా. ఒక్కొక్క కాల్‌కు 30 పైసలు అదనపు ఆదాయమంటే దేశంలో వున్న కోట్లాది ఫోన్ల పై ఎన్ని వందల కోట్లు రాబడి రావాలి?

కొత్తగా ఫోన్లు పెట్టించుకునే వారిని కూడా వదలి పెట్టలేదు. చిన్న పట్టణాలలో టెలిఫోన్ అప్లికేషన్‌తో పాటు చెల్లించే ధరావత్తు సొమ్మును 800 నుంచి రెండు వేలకు పెంచారు. పెద్ద నగరాలలో అయితే అది 3 వేలు – ఒవైటి క్రింద డిపాజిట్ రేట్లను 6 నుంచి 10 వేలకు, 8 నుంచి 15 వేలకు పెంచారు.

టెలిఫోన్ సౌకర్యం విస్తరింప జేయడానికి, వున్న వాటిని ఆధునీకరించ డానికి తమ కుండే వనరులు చాలడం లేదని, అందువల్ల రేట్లు పెంచక తప్పలేదని సెలవిచ్చారు మంత్రి గారు. టెలిఫోన్లకు సంబంధించి నంత వరకు ప్రజల్లో ప్రభుత్వం పట్ల తీవ్ర అసంతృప్తి, ఆగ్రహం వున్నాయి. వేలకు వేలు బిల్లులు చెల్లించడమే తప్ప ఏ వినియోగ దారుడూ తన టెలిఫోన్‌ను సంతృప్తిగా వినియోగించుకో లేక పోతున్నారు. నెలలో సగం రోజులు ఫోన్ పనిచేయదు. ఫిర్యాదు చేస్తే పట్టించుకునే వాడుండడు. పనిచేసినా, రాంగ్ నంబర్లు, క్రాస్ టాక్‌లు, దబదబ శబ్దాలతో విసుగెత్తించేస్తుంది. ఒకేసారి నలుగురైదుగురు లైన్‌లోకి వచ్చేస్తారు. వీటన్నింటినీ మించినది తప్పుడు బిల్లులు. ఫిర్యాదులకు సంబంధించిన టెలిఫోన్లు ఎప్పుడూ సమాధానమే దొరకవు. ట్రంకాల్స్ చేయబోతే ప్రాణం విసిగి పోతుంది. ఇన్ని లోపాలున్న టెలిఫోన్లకు బిల్లులు మాత్రం ఒకేసారి 30 శాతం వరకు పెంచి కట్టాలంటే ఎవరికైనా కడుపు మండడం సహజమే కదా! రేట్లు పెంచే ముందు టెలిఫోన్ సౌకర్యాన్ని మెరుగు పరిచేందుకు మంత్రి గారు ఏదైనా ప్రయత్నం చేస్తే సంతోషంగా బరువును మోసి వుండే వారు. ఆర్థికాభివృద్ధికి సమాచార సౌకర్యాలు ప్రాణ వాయువు వంటివి. టెలిఫోన్, టెలెక్స్, ఫ్యాక్స్ వంటి ఆధునిక సౌకర్యాలు లేనిదే వ్యాపార ప్రపంచం ఒక్క క్షణం కూడా మనుగడ సాగించలేదు. కొత్త టెలిఫోన్ కనెక్షన్ కోసం పదేళ్లు ఎదురు చూడవలసిన దుర్గతిలో ఈ హెచ్చరింపు బాధాకరం.

అసమర్థతతో పాటు, అవినీతి కూడా టెలిఫోన్ల నష్టాలకు ఒక కారణమవడం వాస్తవం. క్రింద స్థాయి ఉద్యోగులు, అధికారులు కొందరు వ్యాపారులకు లోబడి పోయి, అక్రమ కాల్స్‌తో డిపార్ట్‌మెంట్స్‌కు కల్గిస్తున్న నష్టాన్ని నివారించ గల్గితే, ఆ శాఖ నిధుల కోసం ప్రజలను బాధించాల్సిన అవసరం ఏర్పడదు. తమ లోపాలు సరిదిద్దు కోకుండా, ఆ బరువునూ వినియోగ దారులే మోయాలనడం విచారకరం.

# జమీన్‌రైతు

30-4-43

4 పేజీలు 0-1-6

## పర్యాలోచనము

నెల్లూరు జిల్లాలో బియ్యం ధర ఈ నెల ప్రథమ వారంలో మణుగు 1 కి (35 శేర్లు) రు. 8-1-0 నిర్ణయించారు. ఆ ప్రకారం షుమారు 3500 టన్నుల వరకు కొనుగోలు జరిగింది. రైతులు ధాన్యం యివ్వలేదు. వర్తకుల వద్ద సరకు నిల్వలేదు. ప్రభుత్వం తిరుగా ఆలోచించి యీ దినం మణుగు 1 కి 0-12-0 లు ధర పెంచి ఇందులో ప్రభుత్వం తమ ఖర్చుల క్రింద 0-4-0 మిగుల్చుకొని 0-8-0 మాత్రమే రైతుకు యిస్తుంది. అంటే మణుగు 1 కి రు 8-9-0 లకు కొంటుంది. రు. 8-13-0 లకు అమ్ముతుంది. ప్రభుత్వము మ 1 కి 0-4-0 మిగుల్చు కుంటుంది ఖర్చుల క్రింద. ఇందువల్ల ప్రభుత్వపు పాత లెక్క ప్రకారం నెల్లూరు జిల్లా మిగులు ధాన్యం 98,000 ల టన్నులకు మ 1 కి రు 0-4-0 లు వంతున 241/2 వేలు ప్రభుత్వం లాభం సంపాయిస్తుందన్న మాట. మంచి లాభసాటి బేరమే! మధ్యవర్తుల లాభాలు తగ్గించి సరాసరి రైతుకే ధర సంక్రమింపజేస్తాయి అని చెప్పిన ప్రభుత్వము ఇప్పుడు వర్తకులు, ప్రభుత్వము, అను యిద్దరు లాభగాండ్లను సృష్టిస్తున్నది. ఇది కేవలం గర్హ్యం. ధర మాటిమాటికి మార్చడం వల్ల మళ్లీ హెచ్చుననే ఊహతో రైతులు యిప్పుడు అమ్మరు. అసలు జిల్లాలో ఇప్పుడున్న ధాన్యం చాలదని మా వాదం. ప్రభుత్వం వద్ద సరియైన లెక్కలు లేవు. అనవసరంగా ఏదో వక ధరకు ముందు అమ్ముకొని తర్వాత తమకే చాలక తిరిగి ఏ ధరకైనా కొనుక్కోవడం, అదీ దొరక్క పోవడం తటస్థిస్తుంది. కావున ప్రభుత్వం సరియైన లెక్కలు తేల్చే వరకు ధాన్యం అమ్మకుండా చేయడం. కనీసం యిప్పుడు నిర్ణయించిన రేటు రు 8-13-0 లు సరాసరి రైతుకు ముట్టేట్లు చేయడం కనీస ధర్మం. ఇక వర్తకుల వద్ద మాత్రం రిక్విజిషన్ అనే నిర్బంధ పద్ధతి అమలు పరుస్తారట.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

## నెల్లూరు ముచ్చట్లు

### జిల్లా బోర్డు మీటింగ్

బోర్డు మీటింగ్ మే నెల 7 తేది శుక్రవారం సా. 4 గంటలకు తదియ ఘడియల్లో జరుగుతుంది. ఆ సమావేశంలో – రెండు ఆంబోతు ఎద్దులను రు. 500 లకు మించకుండా కొనుట, కాయిపేట కుదుములదిన్నె పాడులోని ఆయుర్వేద ఆసుపత్రిని మరెక్కడికన్నా మార్చడాన్ని గూర్చిన్నీ నందన వనంలోని ఆసుపత్రిని – కనిగిరి తాలూకా తిమ్మారెడ్డి పల్లెకు మార్చుటను గురించిన్నీ, కలిగిరి రోడ్డులో నీడకు ఉపయోగపడు 152 తాటి చెట్లను ధర్మంగా యిచ్చుట, ఇంకొక చోట చాలు చెట్లను వేసి పెంచుటకు ధనం వెచ్చించుట, దర్శి డివిజన్ అరవల్లిపాడు స్కూలు మూసివేయుట, మున్నగు విషయాలు చర్చకు రాబడును.

### సారస్వతవసంతం

3 తేది మహాభారత రచయిత తిక్కన కవి బ్రహ్మోత్సవం, అశుభ వేదిక మీదనే రాయప్రోలు కవి కుమారునికి నూట పదహార్ల బహూకరణ; 4 తేది బృందావనంలో కృష్ణ సదనాన అమృత కలశ గీతాగానోత్సవం; 5 తేది తిక్కవరపు రామిరెడ్డి గారి అంతికోద్యానంలో కృతి సమర్పణ పరిషత్తు, మధురకవితా స్రవంతి పేత జాషువాకు రు 1116 ల బహూకరణం, సాహిత్యో పాసకుల దుర్భాశర్మ, గుఱ్ఱం సుబ్బరామయ్య గారలకు నూట పదహార్ల సత్కారం; 25 తేది కృష్ణుని బృందలో కృతి సమర్పణ మహోత్సవం, కవితా కళానిధి, కవికోకిల మధుర కూజిత రావాలు, ఈ ఫలకుసుమ పరిమళ శోభితమైన సారస్వతామని దర్శిస్తుంటే ఆంధ్ర "కవితకు పెండ్లి పందిళ్లు గప్పించు" శుభ ముహూర్తాలు సమీపించినవా యనిపిస్తుంది.

కొరవ 12 పేజీలో

# స్కీంల దగాల పై చర్యలేదా?

టౌన్‌లో కొంత మంది నిరుద్యోగులు తలా పదివేల రూపాయల వంతున లక్ష రూపాయలు పెట్టుబడి పెట్టి ఫైనాన్స్ కార్పొరేషన్లు, రియల్ ఎస్టేట్ వ్యాపారాలు ప్రారంభించి స్కీంలు నడిపి నాయకుల చేత ప్రారంభోత్సవాలు జరిపి, సాధ్యమైనంత వరకు వసూలు చేసి, తరువాత బోర్డులు తిప్పేస్తున్నారు. వీటిని అరికట్టే నాధుడే కరువయ్యాడు. ఎవరైనా ఈ విషయాలను పోలీసుల దృష్టికి తీసుకెళితే సివిల్ వ్యవహారమంటూ పట్టించుకోవడం లేదు.

కూటి కోసం పది రూపాయలు దొంగ తనం చేస్తే వాళ్ని నడివీధిలో నిలిపి కొడతారు. మరి ఇటువంటి వ్యాపారాల రూపం లక్షలు తినేస్తున్నా ఎవ్వరూ ఏమీ చేయలేక పోతున్నారు. స్కీంలు లాటరీలంటూ వాటి డ్రాలకు రాజకీయ నాయకులను పిలచి ప్రజలను ప్రక్కత్రోవ పట్టించి వారిని ఆర్థికంగా నిర్వీర్యులను చేస్తున్నారు. ఇటువంటి వాళ్లను ప్రభుత్వం ఒక పట్టు పట్టాలి.

నెల్లూరు – కె. బలరామయ్య

## సెక్స్ మందు ప్రమాదకరం

సెక్స్ సమస్యలకు గురైన వాళ్లలో వాలా మంది 'టెస్టోస్టిరాన్' అనే హార్మోనును ఇటీవల వాడుతున్నారు. కాని ఈ హార్మోను బహుకొద్ది మందికి మాత్రమే అవసరమవుతుంది. తప్పనిసరి వినియోగానికి ముందు ఎంత మోతాదు అవసరమో పరిశీలించాలి. అనవసరంగా టెస్టో స్టిరాన్ వాడడమంటే విషాన్ని సేవించినట్టే!

నెల్లూరు – ఇ. రాజగోపాల రెడ్డి

# జనవాణి

## నిజాన్ని నిర్భయంగా రాసారు

23 తేది 'జమీన్‌రైతు' సంచిక 'సణుగుడు' శీర్షికలో 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికలో, ప్రచురించిన శృంగారపు పోకడలను పచ్చిగా విమర్శించారు. ఇంత ధైర్యంగా ఇటువంటి వాఖ్యలు చేసినందుకు అభినందనలు. కాని మీరు ఒక్క విషయ మరచిపోయారు. 'ఆంధ్రజ్యోతి' వార పత్రిక మొదటిసారిగా విజ్ఞానం పేరిట డాక్టర్ సమరం గారిచే సెక్స్ ప్రశ్నలకు సమాధానాలంటూ ఇంతకంటే నీచమైన బూతును ప్రచురించింది. ఇదే ఒరవడిని తరువాత కొన్ని పత్రికలు పాటిస్తున్నాయి.

నెల్లూరు – యద్దనపూడి సరోజిని

కొరవ 8 పేజీలో




తేది. 28.4.93 బుధవారం, ఉదయం గం॥ 9.36 నిముషములకు
మాన్యశ్రీ. డా॥ బెజవాడ గోపాల రెడ్డి గారిచే ప్రారంభించ బడినది.

ఈ సందర్భంగా విచ్చేసి ముఖ్యాతిథులకే మా గోపికను దీవించిన వారందరికి మా కృతజ్ఞతలు.

మా చిన్నారి **గోపిక** ఎ/సి,ను తీర్చిదిద్దిన సాంకేతిక నిపుణులు

స్ట్రక్చరల్ కన్సల్టెంట్స్ : అలెక్స్ జేకబ్, మద్రాసు
మరియు శ్రీ భరత్ బిల్డర్స్, నెల్లూరు
తాపీ మేస్త్రి : SK. మస్తాన్ సాహెబ్
కార్పెంటర్ : SK. ఛోటే సాహెబ్
టెర్రాజ్జో వర్క్స్ : P. సాబ్జాన్
ఎలక్ట్రీషియన్ : రామమూర్తి
వెల్డింగ్ వర్క్స్ : రెహమాన్
పెయింటర్ : బాజి
సౌండ్ సిస్టమ్ & ప్రొజెక్షన్ : 'WESTREX'
ఎయిర్ కండిషనింగ్ : ఓల్టాస్ లిమిటెడ్, సికిందరాబాద్
ఫర్నిచర్ : AR బ్రదర్స్, మద్రాసు
ఇంటీరియర్ డెకొరేషన్ : శ్రీ బాలాజీ ఇంటీరియర్ డెకొరేటర్స్.


డా॥ రామగోపాల రెడ్డి - [illegible]

పెన్నాపేట కుమారి
డా॥ వీరకుమార్ రెడ్డి
డా॥ శ్రీనివాసుల రెడ్డి
* మాధవ్ కాంప్లెక్స్

_WE BANK WITH ANDHRA BANK_

# బరువంతా మాగుంట భుజాల పైనే!

## ఆలస్యంగా రంగంలో దిగినా కాంగ్రెస్ నాయకుల ఏకాభిప్రాయంతో అందరికంటే ముందు మిగిలాడు పెళ్లకూరు!

*** ప్రచారంలో తెలుగుదేశం పకడ్బందీగా వ్యవహరిస్తూంది!**
*** సిపిఎం చావో బ్రతుకో అన్నట్లు పోరాడబోతూంది!**
*** బిజెపి కుప్పలో విత్తులు లేకున్నా కూతలార్భాటం జోరుగా వుంది!**

కోవూరు ఉపఎన్నిక ప్రచారం బాగా ఊపందుకొంది. నామినేషన్ల ఉపసంహరణలు ఇంకా ఒక రోజన్నా రాక ముందే ప్రచారపు సెగలు, పొగలు పల్లెలను చుట్టుముట్టడం అసాధారణం. కాంగ్రెస్ మినహా తతిమా మూడు పార్టీలూ తమ అభ్యర్థులను గడువుకు ముందే ప్రకటించడం దీనికి కారణం కావచ్చు. కాంగ్రెస్ నామినేషన్ వేసేటప్పటికే తెలుగుదేశం, సిపిఎం అభ్యర్థులు ఒక రౌండు పూర్తి చుట్టి వచ్చేశారు. శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి ముందు జాగ్రత్త పడి గోడలు, గోడలు రిజర్వు చేయబట్టి సరిపోయింది గాని, లేకుంటే కాంగ్రెస్‌కు నినాదాలు వ్రాసుకొను స్థలమే మిగిలేది కాదు. "అభ్యర్థి ఎవరైనా మనవాడే మీరు మాత్రం తొందరపడి అటు, ఇటు చూడబాకండి" అంటూ బంధు, మిత్ర బలగానికంతా హెచ్చరికలు పంపి మంచి పనిచేశారు శ్రీ సుబ్బరామిరెడ్డి; ఒక రకంగా అది ఆయనకు ఇబ్బంది కూడా కల్గించింది. పెళ్లకూరును గెల్పించే బాధ్యత ఆయన భుజాల పై పడింది.

ఉరుములేని పిడుగు మాదిరి, గగనం నుంచి హఠాత్తుగా దిగిన విహంగం మాదిరి పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారు కాంగ్రెస్ టికెట్ చేత పట్టుకొని కోవూరు రావడం ఇటు ఓటర్లకు, అటు కాంగ్రెస్ కార్యకర్తలకు కూడా విస్మయం కల్గించింది. ఆ "షాక్" నుంచి వారు తేరుకోలేక పోతున్నారు. కాంగ్రెస్ ప్రచారం ఇంకా పుంజుకోక పోవడానికి అదీ ఒక కారణం. అయితే అదృష్టవశాత్తు రామచంద్రా రెడ్డి గారి అభ్యర్థిత్వం పట్ల ఆశ్చర్యం తప్ప, ఆగ్రహం వ్యక్తం కావడం లేదు. పెద్దగా అలుకలూ లేవు. మొదట్లో జనం నోళ్లలో నానిన దేవకుమార్ రెడ్డి మాత్రం ఆశాభంగం చెందినట్లున్నారు. 28 తేది ఉదయం జె.కె. కుమారుడి వివాహానికి నెల్లూరు వచ్చిన జనార్దన రెడ్డి గారు ఆతన్ని పిలిపించి, స్వాంతన పరచి, భవిష్యత్ ఆశలకు వాగ్దానాల ఊపిరి పోసి, కారెక్కించి పంపడంతో ఆ సమస్య తొలగిపోయింది. నాయకులకు సంబంధించినంత వరకు కాంగ్రెస్‌లో ఏకాభిప్రాయం కుదిరినట్లే లెక్క. జనార్దన రెడ్డి మాగుంట సుబ్బరామ రెడ్డి ఇద్దరూ ఈ ఎన్నికను తమ వ్యక్తిగత ప్రతిష్ఠగా భావిస్తున్నారు. క్యాండిడేట్ ఎంపికలో తమ అభీష్టం నెరవేరలేదన్న అసంతృప్తి వారిలో ఏకోశానా కన్పించడం లేదు. స్వంతం కంటే పార్టీ ముఖ్యమనే విశాల దృక్పథమే వారిని నాయకులుగా పెంచుతున్నది; కాంగ్రెస్‌కు సంబంధించి అభ్యర్థి నిమిత్తమాత్రుడే. మాగుంట సుబ్బరామరెడ్డి గారే సర్వ బాధ్యతలూ స్వీకరించారు. ఆయన బంధుబలగం సమస్తం గ్రామాలలో విపరీతమైన ఒత్తిడికి గురౌతున్నది. మొగమాటపెట్టి, బ్రతిమలాడి, బుజ్జగించి, తన స్వంత ప్రతిష్ఠను కాపాడమని అభ్యర్థించి — కాళ్లు చేతులాడ కుండా కట్టి పడేస్తున్నారు. కార్లు గిర్లు ఏర్పాటు, ఇతర వసతుల కల్పన వారి సంస్థానం ద్వారానే జరుగబోతున్నది. ఒంగోలు ఎన్నికలో తానెంత కష్టపడ్డానో అంతా ఇప్పుడు కష్టించడానికి రెడీ అంటున్నాడు సుబ్బరామిరెడ్డి గారు. పెళ్లకూరు పూర్వజన్మ ఏదో సుకృతం చేసి వుండక పోతే, ఇందరు నాయకుల నుంచి ఇంతటి అయాచిత మద్దతు లభిస్తుంది చెప్పండి! అయితే పదేళ్లుగా నియోజక వర్గంతో, ప్రజలతో ఎడబాటు, సన్యాసం స్వీకరించినట్లు ప్రవర్తించడం, వయస్సు ముదిరిన వారు కావడం రామచంద్రా రెడ్డి రథానికి బ్రేకులు వేస్తున్నాయి. అనారోగ్యం వల్ల ఈ మండే ఎండలలో ఆయన తిరిగి ఓట్లు అడగగలరా అన్నదీ అనుమానమే. తాను ప్రధాన మంత్రి స్వంత అభ్యర్థిని కాబట్టి, అందరూ తన కోసం పనిచేస్తారులే అనే ఉదాసీన భావం ఆయనలో



కన్పిస్తున్న దంటున్నారు. అది నిజమైతే మాత్రం ప్రమాదమే!

డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి మండలాల వారీగా ప్రచార కమిటీలు వేశారు. తాను, వేమారెడ్డి రామచంద్రా రెడ్డి, ఆనం రామనారాయణ రెడ్డి, మేగౌర, సామంతు సుబ్బారెడ్డి తదితర హేమాహేమీలంతా గ్రామాలు కేటాయించుకొని, ఇల్లిల్లు తిరిగి ఓట్లభ్యర్థిస్తామని ప్రకటించారు.

మేనమామ శిక్షణలో గురువును మించిన శిష్యుడుగా, మామకు తగ్గ అల్లుడుగా ఎదిగిన జిల్లా తెలుగుదేశం అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి ప్రచారంలో తమ పార్టీని రన్నింగ్ రేస్ చేయిస్తున్నారు. పకడ్బంది వ్యూహం పన్ని మరీ త్రిప్పుతున్నారు — అభ్యర్థి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డిని! అభ్యర్థి కారెక్కి గ్రామ గ్రామాన ముఖ్యులను కలిసి, దండాలు పెట్టి వెళ్లి పోతుంటే, ఆయన తమ్ముళ్లు, నల్లపరెడ్డి కుటుంబాలలోని కోడళ్లు, కుమార్తెలు జట్లు జట్లుగా విడి పోయి, ప్రతి గడపా ఎక్కి, ప్రతి ఓటరునూ వ్యక్తిగతంగా కలిసి వస్తున్నారు. పెద్ద దిక్కుగా చంద్రశేఖర్ రెడ్డి గారు వుండనే వున్నారు.

ప్రసన్న కుమార రెడ్డి అభ్యర్థిత్వం
కొరవ 8 పేజీలో

మత్స్యశాఖ మత్తులో వుంటే గ్రామ రాజకీయాలు దొమ్మీకి పురికొల్పాయి

# అల్లూరు చెరువులో 10 లక్షల చేపల దోపిడీ!

ఏ మత్స్య కన్యో ఆ దారిని పోతూ అల్లూరు పౌరులకు వరమిచ్చి వెళ్లినట్లుంది – పూట, పూట చేపల పులుసు తిని ఆనందించమని! గతవారం నుంచి చేపల కూర పొయ్యికెక్కని ఇల్లు అల్లూరులో లేదంటే నమ్మండి! చెరువు కల్లోలం. ఎవరికి దొరికిన చేపలు వారు ఎత్తుకెళ్ళి పోవడం, వండి ఫలహరించడం; అడిగే వారు లేరు. తప్పన్నవారు లేరు. అంతా గ్రామ రాజకీయాల పుణ్యం.

అల్లూరు చెరువులో చేపలు పట్టుకొనే హక్కు పాతికేళ్ల నుంచి పొన్నపూడి మత్స్య కారులకు దత్తమై వుంది. వారికి పెద్ద కుటుంబీకుల మద్దతు వుంది. ఆ మత్స్యకారులు ఇందుకోసం చాలా కాలం క్రితమే ఒక సొసైటీ కూడా ఏర్పాటు చేసుకున్నారు. అల్లూరు చుట్టు ప్రక్కల గ్రామాల్లోని గిరిజనులకు ఈ చెరువు పై ఆశ వున్నా బలం లేక గమ్మున వుండి పోయారు. ఇటీవల గ్రామ రాజకీయాలలో వచ్చిన మార్పు మూలంగా




వారికి ఆసరా చిక్కింది. 500 మంది గిరిజనులతో ఒక కొత్త సొసైటీ ఏర్పాటు చేసి చేపలు పట్టుకునే హక్కు తమకిమ్మన్నారు. ప్రభుత్వం పై వత్తిడి తెచ్చి, పొన్నపూడి సొసైటీని స్తంభింప జేశారు. అయితే ప్రత్యర్థి వర్గం తన సత్తా ప్రదర్శించి కొత్త సొసైటీ పై స్టే తెచ్చింది. హై కోర్టు వరకు వెళ్లింది వ్యవహారం. మంత్రుల జోక్యమూ వచ్చింది. ఈ గొడవల్లో చేపలు పట్టే అవకాశం ఎవరికి చిక్కలేదు. 1989 నుంచి చెరువులో చేపలది విరవిహారమే. ఒక్కొక్కటి ఐదారు కిలోల బరువుకు పెరిగి పోయాయి. రెండో పంటకు నీళ్లిస్తుండడంతో వాటి మనుగడకు ఇబ్బంది లేకుండా గడిచిపోయింది.

ఎండలు ముదరడం, డ్రైన్ పనుల వల్ల నీళ్లు వదలక పోవడంతో చెరువు ఎండిపోయే పరిస్థితి ఏర్పడింది. చేపలు ఎగిరెగిరి పడడం ప్రారంభించాయట. వాటిని చూస్తే జనానికి నోరూరింది. మత్స్య శాఖ తన సహజ సిద్ధమైన మత్తులో జోగుతూ, ఇటు వైపు ముఖమే చూపలేదు. గ్రామంలోని ఒక వర్గం జనాన్ని రెచ్చ గొట్టింది. అంతే, పోలోమని చెరువు పై పడిపోయారు. అదేదో వీధి కొళ్లాయిలో తేనె పంచె లెగ్గట్టుకొని పరుగెత్తినట్లు – చెరువును కమ్మేశారు. వలలు, గిలలు దొరకని వారు రాళ్లు, కర్రలతో లోతు లేని దగ్గర చేపలను కొట్టి మరీ తెచ్చుకున్నారట. వారినెవరూ ఆపలేదు.

ఇది తెలిసి పొన్నపూడి సొసైటీ మత్స్య కారులు పోలీసులను వెంటబెట్టుకొని వచ్చారు. లారీ ప్రయోగంతో ఒక రోజు దోపిడి ఆగింది. ప్రక్కరోజు మళ్లీ మామూలే. ఈ న్యూసెన్స్ ఎందుకని కలెక్టర్ గారు పాత సొసైటీకి ఈ ఏడాది చేపలు పట్టే హక్కు దఖలు చేశారు. రిజర్వు పోలీసు కాపలాతో వారు రేపో ఎల్లుండో వలలు విసర బోతున్నారు. ఈ గందర గోళంలో 10 లక్షల విలువైన చేపలు ఇళ్లకు చేరి వుంటాయని అంచనా! ఇంకొక 10 లక్షల విలువైన చేపలు చెరువులో మిగిలి వున్నాయట.

కొరవ 8 పేజీలో



# పెండ్లిండ్లు

ఎక్కడున్నా, ఏమి చేస్తున్నా తన వునికిని, విశిష్టతను గుర్తింప చేసుకునే నెల్లూరు శాసనసభ్యుడు శ్రీ జె.కె. రెడ్డి ఇంటి వివాహ మంటే ఆడంబర అట్టహాస జనాకర్షణలను గూర్చి కొత్తగా వర్ణించి చెప్పవలసిన అవసరం లేదు. ఒకరితో పోలిక, పోటీ కాదు గాని, నిశ్చితార్థం మొదలు, పిలుపులు, కళ్యాణ మండపం వద్ద సాదర స్వాగతం వరకు జె.కె. రెడ్డి దంపతులది విలక్షణంగానే వుంటుంది. డబ్బు ధారాళంగా ఖర్చు పెట్టడం కాదు, ఆహూతుల తాకిడి, కార్ల రద్దీ అనేది లేకుండా ప్రతి చిన్న విషయంలోనూ ప్రత్యేక శ్రద్ధ వహించడం అతని ప్రత్యేకత. తన పెళ్లిళ్లకు పోలీస్ పెరేడ్ గ్రౌండును ఎన్నుకోవడంలోనే జె.కె. భారీతనం విదితమవుతుంది.

ఈసారి షామియానాలతో నిర్మితమై, రంగు రంగుల పూల సరాలతో పై నుండి క్రింద వరకు దిగ వేసుకున్న ఆ కళ్యాణ మండపమే అతి పెద్దది. అన్ని షామియానాలు, అంత పెద్ద షామియానాలు మద్రాసు – హైదరాబాదులలో దొరుకుతాయో దొరకవో నని బరోడా నుండి తెప్పించారట. కొన్ని వేల మంది ఇరుకు లేకుండా ఆసీనులు కావడానికి కుర్చీలు ఏర్పాటు చేశారు. వేదిక విస్తీర్ణము అలంకరణల సంగతి సరేసరి. కార్లు రావడానికి పోవడానికి ఏర్పాటైన మార్గాల కిరువైపుల తాళ్లు కట్టి నాటుటకు వుపయోగించిన కొయ్య పుల్లలు కూడా త్రివర్ణ శోభితం గావించబడ్డాయి. హోం మంత్రి రాక వల్లనో ఏమో పోలీస్ సందడి ఎక్కువగానే వుండింది. సంఖ్యలోనే కాదు, సర్వీస్‌లో కూడా దూరంగా పార్కు చేయబడిన కార్ల కోసం యజమానులకు వెతుక్కునే అవస్థ లేకుండా, మైక్ ప్రకటన ద్వారా కార్లను రప్పించి మంచి సహాయం చేసింది పోలీస్. రద్దీ నివారణకు పోలీస్ శ్రద్ధాసక్తులే కారణం. జె.కె. రెడ్డి పెండ్లికి సూర్య భగవానుడు తన చేతనైనంతగా సహకరించారు – ఆనాడు ఎండ 106 డిగ్రీలు; షామియానాల క్రింద వేడికి తలలు మాడి పోయి ఆహూతులు ముహం చూపించి బయటకు పరుగులు తియ్య వలసి వచ్చింది! పెళ్లిళ్లే కాదు, అన్ని శుభ కార్యాలకూ అదే సుముహూర్తమై నందువల్ల ఆహూతుల జనాభా 'ఫ్లోటింగ్' గా వుండింది.

వరుడు జె.కె. రెడ్డి పెద్ద కుమారుడు, బరోడా కేంద్రంగా కాంట్రాక్టు వ్యాపారంలో ఆరితేరిన యువకుడు రామమోహన్; వధువు – నాయుడుపేట సమీపం మర్లపల్లికి చెందిన మద్రాసు నివాసి, సంస్కార సౌజన్యతా శీలి శ్రీ సోమవరపు శ్రీనివాసులు రెడ్డి తనయ వినుజ ముచ్చటైన జంట.

ఇటువంటి పెద్ద పెండ్లిండ్లను చూస్తే అనిపిస్తుంది – సామాన్య వివాహాలు ఎంత హాయి అని!

* * *

కావలి న్యాయవాది – కోట శ్రీ వి.వి. నరసింహా చార్యులు కుమారుడు హైదరాబాదు జె.ఎన్.టి.యు లెక్చరరు విజయ కుమార్ ఎం.ఎస్. (కంప్యూటర్స్); గుంటూరు – రిటైర్డ్ డిప్యూటీ కలెక్టర్ శ్రీ కె.వి.ఎల్. వరద రాజన్ కుమార్తె, ఎల్.ఐ.సి. వుద్యోగిని శ్రీ లక్ష్మి ఎం.ఎ (లిట్) వివాహం 28 తేదీ గుంటూరు ఇండియన్ టుబాకో అసోసియేషన్ కళ్యాణ మండపంలో జరిగింది.

* * *

1983 తెలుగుదేశం గాలిలో హైదరాబాదు నుండి కావలికి కొట్టుకొని వచ్చి, 1985 సుడిగాలిలో తిరుగా వున్న చోటికే చేరుకున్న మాజీ శాసనసభ్యుడు, పార్టీ ఏదైనా వ్యక్తిగతంగా మంచి వాడైన శ్రీ పాతళ్లపల్లి వెంగళ రావు మేనకోడలు, స్వర్గీయ మోదేపల్లి అంకయ్య కుమార్తె, శుభలక్ష్మి; సౌత్ ఆమలూరు – శ్రీ రావర్ల బలరామయ్య చౌదరి పుత్రుడు చంద్రశేఖర్

కొరవ 12 పేజీలో

# నెల్లూరు నలుచెరుగులా

## విహంగ వీక్షణం

### జనార్ధన రెడ్డి

పూర్వపు ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్ధన రెడ్డి 27,28 తేదులు నెల్లూరులో వుండి వారాలు పోయారు. 30 మే 1 తేదులలో వారాలలో వుంటారు. 2 తేది వుదయం వారాలు నుండి ఉ. 9.30 కి నెల్లూరు చేరుతారు; రోమకు గెస్ట్‌హౌస్‌లో విడిది; సాయంత్రం కోవూరులో జరిగే కాంగ్రెస్ వర్కర్ల సమావేశంలో పాల్గొని ఆ రాత్రి వారాలు చేరి; 3 తేది తిరుపతి మీదుగా ఆకాశ మార్గాన హైదరాబాదు వెళ్లి! ఇదీ ఆయన కార్యక్రమం.

ఇటీవల ఎప్పుడూ వరుసగా జనార్ధన రెడ్డి రెండు రోజులు వారాలలో మకాం చేసినట్లు లేదు. వారాలలో వుండడం కాదు, అప్పుడప్పుడు ఆ ప్రాంతంలో పర్యటించడం బాగుంటుంది.

### కొత్త సినిమా హాలు 'గోపిక'

శ్రీ దేగా రామగోపాల రెడ్డికి రాధా మాధవు లంటే భక్తి ప్రేమలు ఎక్కువగా వున్నట్లున్నాయి. మొదటి రెండు థియేటర్లకు రాధామాధవ్ అని పేర్లు పెట్టారు; తన ఇంటికి కూడా అదే పేరు.

పాపం, 'రాధ' పరాధీన కాగా, మాధవుని వియోగ వ్యధను చూడలేక కాబోలు, రామగోపాల రెడ్డి ఆయనకు 'గోపిక' ను జతచేశారు. విరహాన్ని బాపారు! ఆ కొత్త థియేటర్ 'గోపిక' కు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు 28 తేది వుదయం ప్రారంభోత్సవం జరిపారు. మాధవ్–గోపిక జంట థియేటర్ల ఏ.సి. సౌకర్యానికి బహిర్గారైతు శ్రీ రామమూర్తి మాట నొక్కాడు. ఆంధ్రాబ్యాంకు ప్రధాన శాఖ ఛీఫ్ మేనేజరు, మంచి మనసు – కలసి వచ్చే చెయ్యి కలిగిన శ్రీ వై. చంద్రహాస్ రెడ్డి ప్రాజెక్టర్లకు స్విచ్ ఆన్ చేశారు.

ఉపాహారం తప్ప వుపన్యాసాలు లేవు. మాధవునికి తోడు కల్పించిన శ్రీ రామగోపాల రెడ్డికి మా విజయాకాంక్షలు.



### ఛైర్మన్‌గా మళ్లీ సామంతు?

కోవూరు కో ఆపరేటివ్ చక్కెర ఫ్యాక్టరీ ఛైర్మన్‌గా మళ్లీ శ్రీ సామంతు సుబ్బారెడ్డి గారే నియమింప బడ్డారని, వుత్తరువులు గూడా వచ్చాయని అనధికార వర్తమానం. ఫ్యాక్టరీని ఒడిదుడుకులు లేకుండా, నష్టాల వూబి నుండి బయటకు లాగగలిగిన సమర్థుడైన సామంతు పునర్ నియామకానికి అన్ని విధాలా అర్హుడు. తియ్యగా వుండే చక్కెరను తనివి తీర బొక్కకుండా, సంస్థ వున్నతికి కృషి చేసే వారు ఈ రోజుల్లో ఎందరున్నారు?

ఈ సీజన్‌కు చక్కెర ఫ్యాక్టరీ 'క్రషింగ్' 18 తేది పూర్తయింది. మొత్తం 1,83,437 టన్నుల చెరకు గానుగ ఆడి; ఎన్నడూ లేనంతగా 9.63 శాతం రికవరీ పొంది; 1,70,652 బస్తాల చక్కెర దిగుబడితో 50 లక్షల రూపాయల అదనపు ఆదాయం సంపాయించారు. అంటే గత సంవత్సరం ఈ సంవత్సరం కలసి మొత్తం కోటి రూపాయల లాభం ఆర్జించిందన్న మాట.

గత సంవత్సరం 2,28,866 టన్నులు ఆడారు; రికవరి 9.05 శాతం; గత సంవత్సరం కంటె ఈ సంవత్సరం తక్కువ చెరకు ఆడి, నెల రోజుల ముందే క్రషింగ్ ఆపివేసినా లాభాన్ని ఎట్లా గడించ గలిగారంటె రికవరీ పెరగడం, చక్కెర ధర కిలో 8 నుండి 9 రూపాయలు కావడమే కారణం. ఇప్పుడు 'ఫ్యాక్టరీ' రోజుకు 1,650 టన్నుల చెరకు ఆడ గలిగిన శక్తి గలిగి వుంది; వచ్చే సంవత్సరానికి అది 3 వేలకు పెరుగుతుందట; సీజన్‌కు 3 లక్షల టన్నులు ఆడ గలుగుతుందట.

ఈ క్రమానుగత అభివృద్ధికి ఛైర్మన్ సామంతుకు, సి.ఏ.ఒ. బాబు నాయుడు తదితర సిబ్బంది పూర్తి సహకారం లభించడమే కారణం. వారందరికీ మా అభినందనలు. అది సరే గాని – రైతులకు గిట్టుబాటు ధర ఇతర సౌకర్యాలు ఇవ్వ గలిగారా?

### పొట్టేపాళెం హత్య

నెల్లూరు రూరల్ మండలం పొట్టేపాళెంలో 29 తేది రాత్రి అల్లంపాటి రఘురామిరెడ్డి (52) అనే రైతును కర్రలతో, కత్తులతో పొడిచి చంపారు. ట్రాక్టర్ వెళ్లే దారి విషయమై ఆ రోజు ఉదయం గ్రామం లోని రెండు వర్గాల వారికి పేచీ వచ్చిందట. కొట్లాట జరిగింది. ఒక రైతు యువకుడికి ఆ ఘర్షణలో చేయి విరిగి పోయింది. అది చూసిన అతని బంధువులు ఆగ్రహానికి గురై వారి పై బడి విచ్చలవిడిగా ప్రవర్తించారట. ఆ ఉన్మాదంలో రఘురామిరెడ్డి ప్రాణాలు కోల్పోయాడు.

### కోర్టు సెలవులు

జిల్లా కోర్టు, సబ్ కోర్టులు మే 1 నుండి జూన్ 4 తేది వరకు; క్రిమినల్ కేసులు లేని జిల్లా మునసబు కోర్టులకు మే 11 తేది నుండి జూన్ 4 వరకు సెలవులు. అన్ని కోర్టులు జూన్ 5 తేది తిరిగి తెరవ బడతాయన్న మాట.

వేసవి సెలవుల్లో అడిషనల్ జిల్లా కోర్టు వెకేషన్ కోర్టుగా పనిచేస్తుంది.

### శ్రీహరిదాస్ రిటైర్

తెలుగుగంగ ప్రాజెక్టులో ఆత్మకూరు డిప్యూటీ కలెక్టర్‌గా వున్న శ్రీ కె. శ్రీహరిదాస్ రిటైర్ అయ్యారు. దాసుకు అప్పుడే రిటైర్‌మెంట్ వయస్సు వచ్చిందంటే నమ్మలేము.

శ్రీహరిదాసు రెవిన్యూ ఇన్స్‌పెక్టర్‌గా సర్వీసు ప్రారంభించి, అంచెలంచెలుగా ఉన్నతికి వచ్చిన మంచి అధికారి; నెల్లూరు, కోవూరులలో తాసిల్దారుగా పనిచేసి పై అధికారుల, ప్రజల అభిమానం చూరగొన్నవారు సర్వీసులో పలు అవార్డులూ పొందారు.

### చేపల కాలేజి

చిన్న వుద్యోగాలు కూడా ఇతర జిల్లాల వారికిస్తున్నారని తెలిసింది. ఇది అన్యాయం. ఆలంటికి అన్యాక మర్చి వద్దని ప్రిన్సిపాల్ గారికి మా సలహా.

### కోవూరు అభ్యర్థులు

నామినేషన్ల ఉపసంహరణల తర్వాత కోవూరు ఉపఎన్నిక బరిలో 17 మంది మిగిలారు. వారు వీరు – పెళ్లకూరు రామచంద్రా రెడ్డి (కాం.) నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి (తె.దే) జక్కా వెంకయ్య (సిపిఎం) వెలుగోటి వరదయ్య (బి.జె.పి) పి. సుందరయ్య (బహుజన సమాజ్ పార్టీ) మలిశెట్టి జయరామయ్య, పిచ్చిక వెంకటేశ్వర్లు, అరటి టి.బాల రెడ్డి, వింతలపూడి మురళి, గూడూరు సర్వేశ్వర రావు, ఎండిఖలీలుద్దీన్ అహమ్మద్, రావులకొల్లు మాల కొండయ్య, కోడూరు కమలాకర రెడ్డి, పర్వేపల్లి అబ్దుల్ ఖాదర్, పూల వెంకటరత్నం, దేగా గోపాల కృష్ణారెడ్డి, పి.ఎల్.ఎన్. మూర్తి


కొరవ 8 పేజీలో

# సంస్మరణ

## ప్రథమ వర్ధంతి



సంఘ సేవకులు, ప్రజా సేవకులు

# స్వర్గీయ తిక్కవరపు బాబురెడ్డి గారు

**నిర్యాణం: 4 మే 1992**

వారి ఆత్మశాంతిని కోరుతూ

– డా. టి. సుబ్బరామిరెడ్డి

వారి కుటుంబ సభ్యులు

మిత్రులు, శ్రేయోభిలాషులు

మరియు సిబ్బంది



'రామాయణ ప్రశస్తి' సభలో సముద్రాల లక్ష్మణయ్యను సన్మానిస్తున్న దుగ్గిరెడ్డి రమణయ్య; అటు ఇటు కెవి నారాయణ రావు, బివి నరసింహం

# బడుగు వర్గాల్లో చీలికలు బాధాకరం: పసల

అంబేద్కర్ బడుగు వర్గాల వారి కోసం సృష్టించి ఇచ్చిన హక్కులను వుపయోగించుకొని అభివృద్ధి చెందిన బలహీన వర్గాల వారు ఎవరికి వారే ఎ క్లాస్, బి క్లాస్ వర్గాలుగా విడిపోవడం బాధాకరమని రాష్ట్ర సమాచార శాఖ మంత్రి శ్రీ పసల పెంచలయ్య అన్నారు. 25 తేది కపాడి పాళెంలో అంబేద్కర్ విగ్రహాన్ని ఆవిష్కరించి అనంతరం జరిగిన సభలో మాట్లాడారు. బడుగు వర్గాల్లో మంత్రులు, డాక్టర్లు, ఇంజనీర్లైన వారు తమ కుమారులకు, కుమార్తెలకు వారి కంటే పెద్ద సంబంధాలు వెతికి పెళ్లి చేస్తున్నారు తప్ప క్రింది వారి గూర్చి ఆలోచించడం లేదన్నారు. కపాడిపాళెంలో కమ్యూనిటీ హాల్ నిర్మాణానికి కృషి చేస్తానని మంత్రి హామి ఇచ్చారు. రాష్ట్ర గృహ నిర్మాణ సంస్థ ఛైర్మన్ గూడూరు ఎమ్మెల్యే శ్రీ పత్రా ప్రకాశ రావు మాట్లాడుతూ అంబేద్కర్ పదవుల కోసం ఆరాటపడక నిరంతరం బడుగు వర్గాల అభ్యున్నతికి పాటు పడ్డారని చెప్పారు. నేడు ప్రతి ఒక్కరూ కులం పేరు చెప్పుకొని లబ్ధి పొందాలని చూస్తున్నారని ఇది ఎంతో విచారకరమని నెల్లూరు ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి అన్నారు. తన కోటాలో అర్బన్ హౌసింగ్ స్కీం క్రింద ఇళ్లు మంజూరయ్యాయని తగిన డిపాజిట్ కట్టి ఆ పథకాన్ని సద్వినియోగం చేసుకోవాలని ప్రజలను కోరారు. విగ్రహావిష్కరణ కమిటీ కన్వీనర్ ఎం.జి.ఆర్.దాస్, స్వాతంత్ర్య సమర యోధుడు దేవదానం, అర్జప్ప తదితరులు ప్రసంగించారు.

## రామాయణ ప్రశస్తి సభలు

వర్ధమాన సమాజం ఆధ్వర్యాన 22, 23 తేదీలలో రేబాల లక్ష్మీ నరసారెడ్డి పుర మందిరంలో రామాయణ ప్రశస్తి సభలు ఘనంగా జరిగాయి. తొలి రోజు సభను అధ్యక్షించిన వి.ఆర్. కళాశాల రిటైర్డ్ ఆంగ్లోపన్యాసకులు శ్రీ వి.ఎస్. రామచంద్ర రావు మాట్లాడుతూ పూర్వ కవులైన వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు భావాలు సమాజ శ్రేయస్సుకు అద్దం పడుతాయి. విశ్వ శ్రేయః కావ్యం అనే నానుడి వారి కావ్యాల నుండే అన్వర్థమైందన్నారు. ప్రధాన వక్త రాష్ట్రపతి బహుమతి గ్రహీత, వేద సంస్కృత పాఠశాల సంస్కృతోపాధ్యాయుడు శ్రీ బండి విశ్వనాథం అన్యాపదేశ కవిత్వాన్ని గూర్చి విపులంగా వివరించారు

రెండవ రోజు సభకు అధ్యక్షత వహించిన రిటైర్డ్ జడ్జి శ్రీ కె.వి. నారాయణ రావు మాట్లాడుతూ రామాయణం పరమ పవిత్రమైంది. ఋషితుల్యులైన వాల్మీకి

## నెల్లూరు సంగతులు

చేతిలో తీర్చి దిద్దబడడం వల్ల అది కలికాలంలో సైతం నిలబడిందన్నారు. తిరుపతి ఓరియంటల్ కళాశాల లెక్చరర్ లక్ష్మణయ్య రామాయణంలోని కిష్కింధా కాండ ప్రాశస్త్యాన్ని వివరించారు.

రామాయణ ప్రశస్తి సభలను దాదాపు 22 సంవత్సరాల నుండి నిర్విఘ్నంగా నిర్వహిస్తున్న ఆడిటర్ శ్రీ డి.వి. రమణయ్య వేదికనలంకరించిన వారిని దుశ్శాలువాలతో సత్కరించారు. చివరన వర్ధమాన సమాజం కార్యదర్శి బి.వి. నరశింహులు వందన సమర్పణ చేశారు.

## శాటిలైట్ల సేవలు శ్లాఘనీయం

అనుకోకుండా సంభవించే వుపద్రవాలను ముందుగా పసికట్టడంతో పాటు కమ్యూనికేషన్ల రంగం, వ్యవసాయ రంగం, అక్షరాస్యతను వృద్ధి పరిచే వివిధ రంగాల్లో శాటిలైట్లు అమూల్యమైన సేవలు అందిస్తున్నాయని బెంగుళూరు ఇస్రో శాటిలైట్ సెంటర్ శాస్త్రవేత్త డాక్టర్ కె. కస్తూరి రంగన్ అన్నారు. 24 తేది హోటల్ శివంలో నాయుడమ్మ అభివృద్ధి సంస్థను ప్రారంభించిన అనంతరం జరిగిన సెమినార్‌లో మాట్లాడారు. సామాన్య ప్రజలకు వుపయోగ పడే విజ్ఞాన శాస్త్ర పరిశోధనలు చేసిన శాస్త్రవేత్త నాయుడమ్మ పేర ఒక అభివృద్ధి సంస్థ నెల్లూరు వంటి చోట ఏర్పాటు చేయడం గొప్ప విషయమన్నారు. సంస్థ అతి త్వరలోనే జనంలోకి చొచ్చుకొని పోయి పని చేయ గలదన్న ఆశాభావాన్ని వ్యక్తపరిచారు. నెల్లూరు జోన్ ఎలక్ట్రికల్ చీఫ్ ఇంజనీర్ శ్రీ ఎస్. గురుమూర్తి రెడ్డి మాట్లాడుతూ పర్యావరణ మన్నాయ ఇంధన వనరుల వుపయోగ ఆవశ్యకతను నొక్కి చెప్పారు. కార్యక్రమ నిర్వాహక కన్వీనర్ డాక్టర్ ఎ. జగదీష్ చివరన వందనాలు చెప్పారు.

## నీటి ఎద్దడి నివారణకు 25 లక్షలు

ఎండలు ముదరక ముందే జిల్లాలో తీవ్రమై పోయిన మంచి నీటి ఎద్దడిని రాష్ట్ర ప్రభుత్వం గుర్తించి, దాని నివారణకు 25 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ఇప్పటికే నీటి ఎద్దడి ఎదుర్కొంటున్న గ్రామాల్లో వెంటనే నీటిని వాహనాల ద్వారా సరఫరా చేసేందుకు 10 లక్షల రూపాయలు మంజూరు చేసినట్లు కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివ రావు చెప్పారు. విడుదల చేసి మొత్తంలో నెల్లూరు, కావలి ఆర్డీఓలు చేరి 2 లక్షలు, గూడూరు సబ్ కలెక్టర్ 3 లక్షలు ఖర్చు చేస్తారు. అదే విధంగా గూడూరు, కావలి పంచాయితీ రాజ్ అధికారులకు లక్ష రూపాయల చొప్పున కేటాయించారు. గ్రామీణ ప్రాంతాల్లో నీటి సరఫరాకు వుద్దేశించి గ్రామీణ మంచి నీటి సరఫరా పథకాల ద్వారా పంచాయితీ రాజ్ డివిజన్లలైన కావలికి 6 లక్షలు, గూడూరుకు 5 లక్షలు, నెల్లూరుకు 4 లక్షలు విడుదల చేసినట్లు కలెక్టర్ చెప్పారు.

## షేర్ డీలర్స్ అసోసియేషన్

నెల్లూరు షేర్ డీలర్స్ అసోసియేషన్‌కు 24 తేదీ జరిగిన ఎన్నికల్లో అధ్యక్షుడిగా ఎస్. పార్థసారధి, వుపాధ్యక్షుడుగా ఎ.వి. బాలకృష్ణ, కార్యదర్శిగా కె. మోహన రావు, కోశాధికారిగా ఎస్.వి. జయశేఖర్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఆకుల పుండరీకాక్షం, కె. రాధాకృష్ణయ్య, జి. బాబులు ఈ ఎన్నికలను పర్యవేక్షించారు.

## ఉర్దూ భాషాభివృద్ధికి చేయూత నందిస్తా: జె.కె.

ఉర్దూ భాషాభివృద్ధికి తాను చేయూతనందిస్తానని నెల్లూరు శాసనసభ్యులు శ్రీ జె.కె. రెడ్డి అన్నారు. 17 తేది ట్రంక్ రోడ్డులోని షాదీ మంజిల్‌లో ఉర్దూ మునిసిపల్ పాఠశాల విద్యార్థులు ఏర్పాటు చేసిన భాషాభివృద్ధి సమావేశానికి అధ్యక్షించారు. ఉర్దూ భాష కేవలం ముస్లిములది కాదని, యావద్భారతీయులదని, దాని అభివృద్ధికి అందరూ కృషి చేయాలన్నారు. జస్టిస్ అన్సారీ స్మారకార్థం మహబూబ్ ఖాన్ పార్కులో ఏర్పాటు చేసిన గ్రంథాలయంలోని ఉర్దూ సాహిత్యాన్ని ముస్లింలు సద్వినియోగం చేసుకో వాలన్నారు. ఆ గ్రంథాలయానికి ఉర్దూ పత్రికలు, పుస్తకాలు తెప్పించను పదివేల రూపాయల విరాళాన్ని జె.కె. ప్రకటించారు. టౌన్‌లోని ఉర్దూ పాఠశాలల్లో కొత్తగా 6,7,8 తరగతులను ప్రవేశ పెట్టాలని జిల్లా ముస్లిం మైనారిటీ సంక్షేమ సంస్థ అధ్యక్షుడు షేక్ మొహియుద్దీన్ కోరారు. ఖాళీగా వున్న ఉర్దూ ఉపాధ్యాయుల పోస్టులను భర్తీ చేస్తామని మునిసిపల్ కమీషనర్ జి. రామనారాయణ రెడ్డి సభలో హామి ఇచ్చారు. అనంతరం జరిగిన ముషాయిరా (కవి సమ్మేళనం) కి జిల్లా జడ్జి ఇ. ఇస్మాయిల్ అధ్యక్షత వహించారు. కార్యక్రమంలో రెండో అదనపు మెజిస్ట్రేట్ ఎం.డి. ఇంతియాజ్ అహమ్మద్, డాక్టర్ వహబ్ తసనీమ్, మాజీ కౌన్సిలర్లు సందాని భాష, షఫీ, తదితరులు పాల్గొన్నారు.



ఆ1/8341/92

పురపాలక సంఘ కార్యాలయము
నెల్లూరు, తే 26.3.93 ది

## నెల్లూరు మునిసిపాలిటీ వారి ప్రకటన

నెల్లూరులోని నాకర్స్ రోడ్డు మరియు మెక్లిన్స్ రోడ్డులోని సర్వే నంబర్లు 339/2, 339/3, 339/4, 339/5, 346/2, 346/3, 346/4, 340, 342, 374, 370, 378 మరియు 344 లోని ఖాళీ స్థలములు లే ఔటు మంజూరు కాలేదు. సదరు అనధికార లే ఔటు స్థలము నందు బిల్డింగు ప్లాన్లు అనుమతించరు. మరియు అనధికారపు కట్టడములపై ఆంధ్రప్రదేశ్ మునిసిపాలిటీల చట్టము ప్రకారము చర్య తీసుకోబడును.

కాబట్టి సదరు పై నుదహరించిన సర్వే నెంబర్లు నందలి స్థలములను కొనుగోలు చేయరాదని తెలియజేయడమైనది.

జి. రామనారాయణ రెడ్డి
మునిసిపల్ కమీషనర్

విశాఖపట్నంలో డాక్టర్ తిక్కవరపు సుబ్బరామిరెడ్డి నిర్వహణలో సినీతారల క్రికెట్ క్రీడా మహోత్సవ కమనీయ దృశ్యాలు: తాను విసిరిన బంతి ధాటికి బోర్లా పడిపోయిన విజయశాంతిని భుజానికెత్తుకొని మోస్తున్న చిరంజీవి. పక పక నవ్వులతోటి తోటి కళాకారులు; చిరంజీవితో సుబ్బరామిరెడ్డి; తెలుగు తెర వెలుగులన్నీ ఒక్కటైన అరుదైన దృశ్యం

# రాజకీయాల్లో సత్యనారాయణ?

తెలుగుదేశం పార్టీ తరఫున నటుడు కైకాల సత్యనారాయణ కొన్ని చోట్ల ప్రచారం చేస్తారన్న వార్తలు ఇటీవల పత్రికల్లో వచ్చాయి. ఆ విషయం గురించి సత్యనారాయణను అడిగితే " నాకు రాజకీయాలెందుకండి! మొదట్నుంచీ ఆ రంగంలో నాకే మాత్రం ఆసక్తి లేదు. మా నాన్న గారు కన్ను మూసే ముందు నా చేత కొన్ని వాగ్దానాలు చేయించారు. వాటిని నెరవేర్చడం నా బాధ్యత. కుటుంబపరమైన బాధ్యతలు నాకు చాలా వున్నాయి. మరో వంక సినిమాలు పుష్కలంగా వున్నాయి. వీటిని పక్కన పెట్టి నేను రాజకీయాల్లోకి ఎలా ప్రవేశించ గలను? ఆ మధ్య కొందరు వచ్చి, కైకలూరు ప్రాంతంలో కొన్ని ఉపన్యాసాలివ్వా లన్నారు. సరే చూస్తా- అన్నానంతే. అసలు రాజకీయ రంగంలో నేను రాణించ లేనండీ", అని నవ్వారు.

## జయప్రద ఏటా 5 చిత్రాల్లో నటిస్తుందట

మోతాదుకు మించి నిద్రమాత్రలు పుచ్చుకుందన్న వార్తల నేపథ్యంలో ఏప్రిల్ 21 న జయప్రద తన స్వగృహంలో పాత్రికేయుల సమావేశాన్ని ఏర్పాటు చేసింది. బాగా సన్నబడి, చాలా నీరసంగా వుందామె. " నా నటనాకౌశలాన్ని ప్రదర్శించ దగ్గ పాత్రలు లభిస్తే, నాలుగు కాలాల పాటు నలుగురూ గుర్తుంచుకో దగ్గ పాత్రలు చేయాలని వుంది. అలాంటివి ఇది వరకు నటించాను. ఇప్పుడు తెలుగు సినిమా రంగం ఎంతగానో మారిపోయింది. కొత్త కొత్త తారలెందరో వచ్చారు. కానీ, వీళ్లకు అనాడు మేం ధరించి నటువంటి పాత్రలు ఎలా లభిస్తాయి? ఓల్డ్ ఈస్ గోల్డ్ కదా? మొత్తం మీద ఏటా అయిదు చిత్రాలలోనైనా నటించాలని ఉంది అందామె.

## చిత్రాల దాడి

చిత్రాలలో హింస, అశ్లీలం వగైరాలుంటే రాయితీలు ఇవ్వబడవని ముఖ్యమంత్రి ప్రకటించడంతో అలాంటి మసాలా చిత్రాలు నిర్మించే వారి గుండెల్లో రైళ్లు పరుగెడుతున్నాయి. జీ.వో. వచ్చే లోగానే తమ చిత్రాలను మన రాష్ట్రం మీద దాడి చేయడానికి చాలా హడావుడి పడిపోతున్నారు. ఇటీవల చాలా చిత్రాలు ఒక దాని మీద ఒకటి పోటీగా విడుదలై, ఏదీ నిలబడ లేక పోయిన విషయం అందరికీ తెలిసిందే. మే నెలలో కూడా ఈ దాడులు, పోటీలు తప్పేటట్లు లేదు. దివ్యభారతి నటించిన చివరి తెలుగు చిత్రం " తొలిముద్దు "ను ఎంత త్వరగా విడుదల చేద్దామా అని నిర్మాత తహతహ లాడి పోతున్నాడు. ప్రేక్షకులకు ఏ చిత్రాలు ఎప్పుడు విడుదలయ్యాయో, ఏ చిత్రాలు వెనక్కు తిరిగి వెళ్లి పోయాయో కూడా తెలియడం లేదు! అంతా అయోమయంగా వుంది.

సినిమా

# పెళ్లి పీటల పై మీనాక్షి శేషాద్రి

హిందీ చిత్రసీమలో నంబర్ టూ గా వున్న మీనాక్షి శేషాద్రికి పెళ్లి చేయాలని ఆమె తల్లిదండ్రులు రెండేళ్లుగా ప్రయత్నాలు చేస్తున్నారు. ఇప్పుడు కాలం కలిసి వస్తోంది. మద్రాసులోని నీలకంఠ్ నాగరత్నం అనే పారిశ్రామిక వేత్తతో పరిణయం త్వరలో జరగ వచ్చు. వరుని వయసు 30, కొన్ని రెడిమేడ్ దుస్తుల ప్రకటనల్లో మోడల్‌గా పాల్గొన్నాడు కూడా. అసలు ఇతడ్ని మూడేళ్ల క్రితమే మీనాక్షి చూసింది. అప్పుడితను వివాహానికి సమ్మతించలేదు. తన దృష్టి ప్రస్తుతం పరిశ్రమ అభివృద్ధి కార్యక్రమాల పైనే లగ్నమై ఉందనీ, సినిమా తారను చేసుకోవాలనే మోజు తనకు లేదని అప్పుడు చెప్పాడు. గత సెప్టెంబర్‌లో మద్రాసులో ఏదో కార్యక్రమ సందర్భంలో అతనామెను మళ్లీ చూశాడు. పలకరించాడు. ఆమెను తాను ఇప్పుడు పెళ్లాడ్డానికి సిద్ధంగా వున్నట్లు చెప్పాడు కూడా. మీనాక్షి ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. బొంబాయికి వెళ్లగానే తన తల్లిదండ్రులతో ఈ విషయం చెప్పింది. ఈలోగా ఆమె తల్లిదండ్రులు అమెరికాలోని హోస్టన్ నగరానికి చెందిన మరో పారిశ్రామిక వేత్తతో ఆమె వివాహం జరిపించాలని ప్రయత్నాలు చేశారు. మీనాక్షి ఎవర్ని పెళ్లి చేసుకుంటుందో ఏమో గాని, త్వరలో ఆమె పెళ్లి జరగడం మాత్రం తథ్యం. మద్రాసులోని ఆమె స్వంత భవనానికి అప్పుడే అలంకరణలు ప్రారంభమయ్యాయి.

## ప్రభుత్వ ఖజానాకు గండి

రాయితీల ఆశతో ఏదో ఒక చెత్త సినిమా రీళ్లు చుట్టేయడం వల్లనే సినిమాలు బాక్సాఫీస్ వద్ద చతికిల బడి పోతున్నాయని నేడు సామాన్య ప్రేక్షకుడు కూడా చెప్పుకుంటున్నాడు. వ్యాపారం అద్యంతం అనారోగ్య వాతావరణంలో జరుగుతున్నది అన్న విషయం అందరూ ఎరిగిన సత్యమే. చాలా మంది ఎగ్జిబిటర్లు, డబ్బింగ్ చిత్రాలు ప్రదర్శిస్తూ కూడా, లో బడ్జెట్ చిత్రాలు ప్రదర్శిస్తున్నట్లు లెక్కలు వ్రాసి, అధికారుల అలసత్వాన్ని ఆసరాగా తీసుకుని, ఈ గండి కొడుతున్నారన్న విషయం కూడా ప్రభుత్వం దృష్టికి వచ్చి వుండవచ్చు. వివిధ రకాల వినోదపు పన్నులను రద్దు చేసి, అన్ని చిత్రాలకూ ఒకే విధమైన పన్ను విధానాన్ని ప్రవేశ పెడితే గాని ఈ అక్రమాలు అరికట్టడం వీలవదు.

# మేజర్ చంద్రకాంత్

## ధీటైన నటనా ప్రతిభకు ముసలి తనం అడ్డుకాలేదు

ఎన్టీరామారావు తాను తిరిగి ప్రజల అభిమానాన్ని పొందాలంటే, నటించడం మినహా గత్యంతరం లేదని ఏ క్షణాన నిర్ణయం తీసుకున్నారో గాని, ఆ నిర్ణయం ప్రజల పాలిట శాపంలా పరిణమించింది. చరిత్రను వక్రీకరించి, ప్రేక్షకులకు పిచ్చిపట్టేలా ఆయన స్వయంగా నటించి, నిర్మించిన 'బ్రహ్మర్షి విశ్వామిత్ర' 'సమ్రాట్ అశోక' లను ప్రజలు నిర్మొగమాటంగా తిరస్కరించిన నేపథ్యంలో సాంఘిక చిత్రంలో నటించైనా ప్రజాభిమానంపొందాలనే దుర్మార్గపు కోరిక మళ్లీ ఆయనలో వుద్భవించింది. ఆ కోరిక విపరిణామమే ఎన్టీఆర్ వీరాభిమాని, నటుడు మోహన్ బాబు నటించి, నిర్మించిన 'మేజర్ చంద్రకాంత్'. ఈ చిత్రంలో అలనాటి విశ్వ విఖ్యాత నటసార్వభౌముడు రీలుకు మించి కనపడరు. వయోభారానికి తోడుగా ఎబ్బెట్టుగా వేసిన మేకప్, అతిగా కనిపించే నటన, స్పష్టత కోల్పోయిన గళం నేటి యువ ప్రేక్షకులను ఆకట్టుకోలేదు. అసలు దర్శక, రచయితలు పాత్రను మలచిన తీరే బాగోలేదు. క్రమశిక్షణకు మారు పేరైన చంద్రకాంత్ పరమవీర చక్ర బిరుదు పొందిన సందర్భంలో, టి.వి.లో

### అల్లూరు రహీం

ప్రసారమయ్యే ఇంటర్వ్యూలో ఆ పాత్రను బలహీన పరుస్తూ 'కన్ను' కొట్టడం వంటి చౌకబారు చేష్టలు చేయించారు. కనపడిన చోటల్లా వూకదంపుడు వుపన్యాసం, సన్నివేశానికి అతకని నటన ప్రదర్శింప జేశారు. కథా గమనంలో యాక్సిడెంట్ చేసిన బావను కాపాడను బావమరిది స్మగ్లర్‌గా కావడం, దుక్కలా వుండే మేజర్ భార్యకు 'క్యాన్సర్ అని చెప్పిన క్షణం నుండి ముఖాన ప్రేత కళ తాండవించడం. హీరోయిన్ సీత సాముహిక వివాహ ప్రహసనం మరో హీరోయిన్ హేమ స్మగ్లర్‌మారడం కథను నీరస పరచాయి ప్రథమార్థమంతా చౌకబారు హాస్యమంటూ చేపల మందు తినిపించడాలు, హీరోయిన్‌ల అంగాంగ ప్రదర్శనలకు తోడుగా భారీ సెట్టింగులు చూపించి ప్రేక్షకులను ఆకట్టుకోను తీవ్రంగా ప్రయత్నించారు.

పదునైన మాటలు, హిట్ పాటలు, రాఘవేంద్ర రావు మార్కు ట్రిక్కులు వున్నా 'చంద్రకాంత్' స్టోరిని పోలిన ఎన్టీఆర్ సినిమాలు ఇంతకు ముందే చూసి వున్న అనుభూతికి సామాన్య ప్రేక్షకుడు సైతం వచ్చేస్తాడు. అయితే పౌరాణిక పాత్ర పోషణ, కరుణ రస

కొరవ 13 పేజీలో

నాయుడమ్మ సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ సెంటర్‌ను జ్యోతి వెలిగించి ప్రారంభిస్తున్న బెంగుళూరు రోదసీ శాస్త్రవేత్త డాక్టర్ కె. కస్తూరి రంగన్; సెంటర్ కన్వీనర్ డాక్టర్ ఎ. జగదీశ్

## నామినేషన్

(2 పేజీ తరువాయి)

ఆ అవరణంలోనే సభ; పలకవని మొరాయించిన మైకును ఎట్నో పలికించారు. మైకు దొరికితే మనవారి సంగతి చెప్పాలా? నాయకుల వాగ్ధాటితో అసలే చెమటతో నానివున్న కార్యకర్తల చొక్కాలు ముద్ద ముద్ద అయిపోయాయి. పెళ్లకూరు 20 వేల మెజారిటీతో గెల్చి తీరుతారని మంత్రి పెంచలయ్య ఢంకా భజాయించారు. కోవూరు ఎన్నికతో తాను ఒంగోలు దాటివచ్చి నెల్లూరు జిల్లా రాజకీయాల్లో ప్రత్యక్షంగా రంగ ప్రవేశం చేస్తున్నానని శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి అన్నారు. ప్రధాని, ముఖ్యమంత్రు లిద్దరూ పెళ్లకూరు గెలుపు బాధ్యత తన భుజాల పై మోపారని, తన శక్తికి లోటు లేకుండా శ్రమించి పని చేస్తానని చెప్పారాయన. పదవి కోసం పార్టీలు మార్చే వారిని ప్రజలే పాతిపెట్టాలని శ్రీ సి.వి. శేషారెడ్డి ఆవేశ పడ్డారు. నల్లపరెడ్డ పైన అన్యాపదేశ చురక ఇది. యానాదిరెడ్డి గారి ప్రసంగ మంటే వినేవారికి మహదానందం. పెళ్లకూరే అభ్యర్థని ముందే చెప్పి వుంటే ఇంత మంది ఇంత ప్రయాస పడవలసిన అగత్యం వుండేది కాదు కదా అని నిష్ఠూర పడ్డారాయన. వేదిక మీద వుండే నాయకులు మాటల్లో కాకుండా, చేతల్లో తమ కాంగ్రెస్ భక్తి చూపి, కష్టపడితే గెలుపు రామచంద్రా రెడ్డిదే నన్నారు యానాదిరెడ్డి. ఆ హితోక్తి తనకూ అన్వయిస్తుందా? రావుల అంకయ్య గౌడ్ తనను జైలు నుంచి విముక్తి చేసిన పెళ్లకూరు విజయానికి తన శక్తినంతా వుపయోగపెట్టి పని చేస్తానన్నారు. ఎమ్మెల్యేలు శ్రీ జి.కె. రెడ్డి, విష్ణువర్ధన్ రెడ్డి, వెంకట రత్నం నాయుడు తదితరులంతా మాట్లాడారు. డిసిసి అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవ రెడ్డి, మాజీ ఎమ్పీ శ్రీ గౌస్ మొహిద్దీన్, మాజీ ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి తదితరులు హాజరైనారు. ఆప్సెంటైన ఎమ్మెల్యేలు – శ్రీ మాదాల జానకిరాం, డాక్టర్ సుందర రామిరెడ్డి మాత్రమే. డైరీ ఛైర్మన్ శ్రీ బెజవాడ సురేష్ రెడ్డి అందరికీ చల్లటి మజ్జిగ ఇచ్చారు – బిల్లు కట్టి తెచ్చినా పాపం సురేష్‌కి పత్రికల్లో చురకలు తప్పలేదు.

* * *

నామినేషన్ మొదట దాఖలు చేసింది తెలుగుదేశం అభ్యర్థి శ్రీ ప్రసన్న కుమార రెడ్డి, 23 తేది ఉదయమే ఆయన ఆ పుణ్యకార్యం జరిపించేశారు. కాంగ్రెస్ వలె సాదా, సీదాగా కాకుండా, టౌన్‌లో పెద్ద ప్రదర్శన నిర్వహించి మరీ తాలూకాఫీసుకు వచ్చారు. తప్పెట్లు, తాళాలు, బెట్ల మోతతో కోవూరు దద్దరిల్లింది. ఈ కార్యక్రమంలోనూ తండ్రి అడుగుజాడలలోనే నడిచాడు ప్రసన్న. ఇంటి నుంచి బయల్దేరి విజయశ్రీ లాడ్జి 1 నంబరు గదిలో కొద్ది సేపు విరామం; కన్యకాపరమేశ్వరి గుడి నుంచి ప్రదర్శన ప్రారంభం తదితరాలన్నీ పద్ధతిగా జరిపించాడు. పెళ్లకూరు ప్రభాకర రెడ్డి మినహా తతిమా పచ్చ చొక్కాల నేతలంతా హాజరు వేసుకున్నారు.

* * *

తెలుగుదేశం దరబదలు చూసి మేమెందుకు తక్కువ తినాలనుకున్నారేమో, సిపిఎం వారు కూడా 24 తేది ఉదయం అట్టహాసంగా నామినేషన్ యాత్ర జరిపారు. ఫారి బయట, ముంద బయలు నుంచి వూరేగింపు ప్రారంభమైంది. కోవూరులో జనం విషయంలో వీళ్ళూ పున్నామనుకున్నారేమో జిల్లా అంతటి నుంచి ఎర్ర దండను లారీలెక్కించి రప్పించారు. వూరేగింపు మాత్రం ఆ పార్టీకి తగిన క్రమ శిక్షణ, పాటలు కోలాటాలతో జరిగింది. కోవూరు సంతటినీ ఎర్ర జెండాలు, చొక్కాలతో ఎర్రబారించేశారు. రాష్ట్ర నాయకుడు కొరటాల సత్యనారాయణ, అసెంబ్లీ నాయకుడు బోడేపూడి వెంకటేశ్వర రావు హాజరైనారు.

* * *

బిజెపి నామినేషన్ 26 తేది ఉదయం జన సమ్మర్దంగా జరిగింది. వెంకయ్య నాయుడు గారు ముందు నిలబడి తమ అభ్యర్థి వరదయ్య చేత నామినేషన్ వేయించారు. పూజలు, పునస్కారాలు శాస్త్రోక్తంగా జరిగాయి. నినాదాలతో జనం చెవులు చిల్లులు పడ్డాయి.

## పెండ్లిండ్లు

(6 పేజీ తరువాయి)

బి.ఇ., ఎ.ఎం.ఐ.ఇ, ఎం.బి.ఎ., పరిణయం 28 తేది హైదరాబాదు – వెంగళరావు గారింట జరిగింది.

* * *

నెల్లూరు గవర్నరు, అంటే పక్షపత్రిక 'గవర్నరు' సంపాదకుడు శ్రీ సర్వేపల్లి సుబ్బారావు కుమారుడు నాగేశ్వర రావు; రంగనాయకుల పేట – శ్రీ రాళ్లపల్లి హనుమంత రావు కుమార్తె పద్మజ వివాహం 28 తేది రంగనాయకుల పేట చిత్రకూటంలో జరిగింది.

* * *

కావలి తల నెరసిన రాజకీయ వాది, తెలుగుదేశం నాయకుడు, ఆనం సంజీవ రెడ్డి అధికారంలో ఎన్.సి. హయాంలో జిల్లా పరిషత్తు వుపాధ్యక్షుడు శ్రీ గొట్టిపాటి కొండప నాయుడు మనవరాలు, శ్రీ మాల్యాద్రి నాయుడు కుమార్తె సమత; విజయవాడ శ్రీ అంబటి వెంకటేశ్వర రావు కుమారుడు మురళి వివాహం 24 తేది కావలి – విశ్వోదయ హై స్కూలులో జరిగింది.

* * *

అల్లూరు మండల సహకార గ్రామీణాభివృద్ధి విస్తరణాధికారి శ్రీ చిట్టూరి జయదేవ దానం కుమార్తె సువర్ణ కుమారి; కనిగిరి అధ్యాపకుడు శ్రీ దైవకటాక్షం కుమారుడు స్వామిదాస్ 'పవిత్ర పరిణయం' ఆ మధ్య కనిగిరి బాప్టిస్టు చర్చిలో జరిగింది.

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

### దానాలు

వి.వి. కృష్ణయ్య గారు 25 తేది "అమృత కలశ" కృతిస్వీకార పుణ్యముహూర్తాన సంస్కృత కళాశాలకు రు 116 లు, యానాది హాస్టలుకు రు 25 లు, జర్నలిస్టు అసోసియేషన్‌కు రు 25 లు, హరిజన బాలుర హాస్టలుకు రు 16 లు, హరిజన బాలికల హాస్టలుకు రు 16 లు, అనాధ శరణాలయానికి రు 16 లు సమర్పించి చరితార్థులైరి.

### ప్రచండ భార్గవం

నా మట్టుకు నాకు యేమి రుచించలేదండి. ఇందులో కొత్త వాసన గాని, నవ్య పోకడలు గాని, శక్తి గాని, ప్రదర్శనా కళా విదగ్ధత గాని కనిపించ లేదు స్వామీ!

ఆర్ట్ సెంటరు, ఫైన్ ఆర్టు సొసైటీ వారల కృషి యింతో ముందుకు నడుస్తుంటే అవాది ఆంధ్రసభగారూ! మీరు వెనక్కు నడిస్తే ఎట్లానండి?

### రిక్షాలు

టవున్‌లో వీటి సంఖ్య 500 దాకా పెరిగింది. దీనివల్ల 4,5 వందల మంది యానాది మున్నగు పేదలు ముప్పూటా అంతగంజి తాగుతున్నారు. స్వంతదార్లూ కొంత కాలం గడుపుతున్నారు. ప్రయాణీకులకు గూడ సలీసుగా వుంది. నేడెందుకో పోలీసు దృష్టి వీట్ని తగ్గించాలని చూస్తున్నది. డిప్టీ సూపరెంటు గారూ! ఇవి తగ్గిస్తే చాలా మంది పేదల కడుపుల మీద కొట్టినట్లౌతుంది. ఆలోచించండి!.

– విమర్శకుడు

## ఈ వారం ఎండ

| | |
|---|---|
| 24 తేది | 101.8 |
| 25 తేది | 97.7 |
| 26 తేది | 102.7 |
| 27 తేది | 104.9 |
| 28 తేది | 106.1 |
| 29 తేది | 1061 |

## నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు 9672 (పాతవి) | 3,600/- |
| 9672 (కొత్తవి) | 3,100/- |
| 9674 (పాతవి) | 3,800/- |
| జ.ఆర్. 20 | 2,500/- |
| బియ్యం (70 కిలోలు) | 550/- |
| బియ్యం 1 కేజి | 8/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,520/- |
| వెండి (10 గ్రా) | 65/- |
| పెసలు (100 కిలోలు) | 970/- |
| నువ్వులు (75 కిలోలు) | 780/- |
| వేరుసెనగ నూనె (కేజి) | 24.50 |
| మిరపకాయలు (కేజి) | 20/- |
| చింతపండు (కేజి) | 19/- |
| చక్కెర (1 కేజి) | 11.20 |
| బెల్లం (1 కేజి) | 12/- |

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 9.2 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 2.8 అ |
| నెల్లూరు చెరువు (1 కేజి) | 12.1 అ |

## పంచాంగము

### దొల్లుకర్తిరి

తేది 1 శనివారము 'మేడే' ప్రపంచ కార్మిక దినం

తేది 4 మంగళవారము దొల్లుకర్తిరి ప్రారంభము

తేది 5 బుధవారము నృసింహ జయంతి

### ముహూర్తములు

తేది 5 బుధవారము ఉదయం 9.32 గంటలకు వివాహ, వ్యాపారంభములకు మిధున లగ్నము

### మే తిథులు

| | | | |
|---|---|---|---|
| తే 1 శని | దశమి రా.గ. | 9.10 | వ |
| తే 2 ఆది | ఏకాదశి రా.గ. | 6.40 | వ |
| తే 3 సోమ | ద్వాదశి సా.గ. | 4.15 | వ |
| తే 4 మంగళ | త్రయోదశి | ప.గ. | |
| తే 5 బుధ | చతుర్దశి ప.గ. | 11.45 | వ |
| తే 6 గురు | పూర్ణిమ ఉ.గ. | 9.45 | వ |
| తే 7 శుక్ర | పాడ్యమి ఉ.గ. | 7.45 | వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ

## పినాకినీ తీరం

(2 పేజీ తరువాయి)

అభ్యర్థిగా తేవాలనే శ్రద్ధ పట్టుదల వుండడం పసిగట్టబట్టే ఆ వారమే ఆ విధంగా అన్యగలిగాము. అప్పటి నుంచి మొన్నటి వరకు ఆ ప్రయత్నించు నిరంతరాయంగా • కొనసాగుతూనే వుంటింది. చైనా పర్యటనను ఒక రోజు తగ్గించుకొని పెళ్లకూరు ఢిల్లీకి చేరడంలోనే అది ధృవ పడుతుంది.

గతవారం కోవూరు ఎన్నికను గూర్చి వ్రాసేటప్పుడు కూడా పెళ్లకూరును తేవాలనే ప్రయత్నం ఇక్కడ నుండి తీవ్రంగా జరుగుతున్నదనే సంగతి మాకు తెలుసు. కాని ప్రస్తావించలేక పోయాము. ఆయన కుమారుడు, విద్యావంతుడైన యువకుడు వసంత కుమార్ రెడ్డి కాంగ్రెస్ అభ్యర్థిత్వం కోసం ప్రయత్నించు కుంటున్నప్పుడు, తండ్రిగా రామచంద్రా రెడ్డి గారు తానే అభ్యర్థిగా రంగంలోకి దిగుతారని మేము నమ్మలేక పోయాము. తన వలుకుబడిని కుమారుడికి వుపయోగిస్తారనుకున్నాము. తెలిసి కూడా పెళ్లకూరు అభ్యర్థిత్వం సంగతి గతవారం ప్రస్తావించ కుండడానికి మేము ఆ విధంగా పొరపాటు పడడమే కారణం!

పెళ్లకూరు అభ్యర్థిత్వం కోసం నెల్లూరులో వుండి ప్రయత్నించిన అందరూ ఆయన పట్ల అభిమానం గలవారని అనుకోము. దేవకుమార్ రెడ్డి అభ్యర్థిత్వం బెడదను తప్పించు కోడానికి తగిన అభ్యర్థి అని కొందరు భావిస్తే; కొందరు జనార్ధన రెడ్డిని దెబ్బ తీయడానికి మంచి అవకాశమని వుద్దేశ్యపడితే; మరికొందరి అంతరంగం అవగాహనకు అందలేదు. వీరి ప్రయత్నమంతా హైదరాబాదుకే పరిమితం. పంతులు గారి సంగతి ఆసక్తిగల అసలు అభ్యర్థి చూచుకొని వుండవచ్చు. ఎవరైతేనేమి, ఏమైతే నేమి ఈ రోజు కోవూరు కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డి!

ఢిల్లీ స్థాయిలో వున్న ఆయనకు మళ్లీ అడుగున వున్న కోవూరుకు దిగజారాలనే వుద్దేశ్యం ఎందుకు కలిగింది? ఎం.ఎల్.ఎ. అయితే 'ఇఫ్కో' పదవి పోదు. అది ఆయనకు తెలుసు; మనకూ తెలుసు. కేవలం శాసనసభ్యత్వం కోసం అంత శ్రమ తీసుకుంటున్నారను కోగలమా? మూడు సార్లు చీకి పారేసిన మామిడి ముట్టె వంటిది పెళ్లకూరుకు శాసనసభ్యత్వం! అటువంటి సారంలేని సభ్యత్వం పట్ల ఇప్పుడు అభిరుచి కలుగుతుందా? అది కాదు; తన రాజకీయ జీవిత లక్ష్యం. నెరవేరడానికి అక్కడ ఇక్కడ అనుకూలత లున్నాయని, ఇప్పుడు తప్పితే అది నెరవేరే అవకాశం లేదని ఆయన గట్టిగా అభిప్రాయ పడి వుండాలి. ఈ నాటి ఆయన పోటీకి ప్రేరణ అదే అయి వుండాలి. ఇక్కడ వారి ప్రయత్నం ఆయన అభ్యర్థిత్వానికి కారణమను కుంటున్నాము గాని, ఆయన అభ్యర్థిత్వానికి ఆయనే కారణం!

గెలుపు, ఓటముల సంగతి అనుమానం లేదు. చతుర్ముఖ పోటీలో పెళ్లకూరు కాకుంటే ఇంకెవరు గెలుస్తారు? ప్రధాని అభ్యర్థి, ముఖ్యమంత్రికి అభిమాని అనేవి పెళ్లకూరుకు పెద్ద పెట్టుబడులు. పెద్దలిద్దరి ప్రమేయం వుంది కాబట్టి జిల్లాలోని కాంగ్రెస్ వారులందరూ చేసి తీరుతారు. పది సంవత్సరాల నుండి సంబంధం లేదనే గాని, అంతకు ముందు రెండు సార్లు ప్రాతినిధ్యం వహించి చేసి పోయిన పాత కాపురమే గదా! కుర్రకారువచ్చింది; ప్రజల ఆలోచనలు పోకడలలో మార్పు వచ్చింది; పదేళ్లలో వచ్చిన ఈ మార్పు తల్లక్రిందులైనదే. కాని మిత్రులుగా చేయి చేయి కలిపి సమైక్యంగా సంఘటితంగా కాంగ్రెస్‌ను ఎదుర్కొంటుండిన ముగ్గురు మిత్రులు మూడు దారులయ్యారు; వేరు వేరు కుంపట్లు పెట్టుకున్నారు. ఎవరి వంట వారు ప్రారంభించారు. ప్రతి పక్షాలు చీలిపోయి, ఓట్లు చీల్చుకుంటున్న ఈ సమయంలో గెలువ లేక పోతే ఇంకెప్పటికీ గెలవలేరను కోవాలి! కాని గెలుపు సులభమని గాని, 'వాకోవర్' అని గాని అనుకోవడం పొరపాటు. చెమట పట్టే శ్రమ అవసరమనే వాస్తవాన్ని మనసులో వుంచుకుంటే మంచిది.

పెళ్లకూరు శాసనసభ్యుడ వుతాడు; తన జీవిత లక్ష్యమైన మంత్రిత్వాన్ని సంపాదిం చుకుంటాడు; రాష్ట్రంలో మంత్రిత్వం ముందు దేశం స్థాయిలో 'ఇఫ్కో' ఛైర్మెన్ పదవి తనకు బలాదూర్ అనిపిస్తారు!

ఒక వేళ అది రాకున్నా అదనంగా చేతికి ఇంకో పదవి వస్తుంది గాని, వుంటేది పోదు. కాంగ్రెస్ జోడు పదవుల నిబంధన పి.వి.కి వలె పెళ్లకూరుకూ వర్తించ బోదు!

## మేజర్ చంద్రకాంత్

(11 పేజీ తరువాయి)

నటనలలో ఎన్టీఆర్ చేవ ఏ మాత్రం తగ్గలేదని చిత్రంలోని ఒక పాటలో కనిపించే అల్లూరి, శివాజీ, కట్ట బ్రహ్మన్న గెటప్స్ నిరూపించాయి. హాస్పిటల్‌లో భర్తగా చూపే ఆతృత, ఆహార్యం ఎన్టీఆర్ ప్రతిభకు అద్దం పట్టాయి. నేతాజీ సుభాస్ చంద్రబోస్ గెటప్ ఎందువల్లో అంతగా అతక లేదన్నది మాత్రం నిజం.

స్టోరిలోకి వెళితే సైన్యంలో మేజర్ అయిన చంద్రకాంత్ (ఎన్టీ రామారావు) టెర్రరిస్టులు కిడ్నాప్ చేసి తీసుకెళ్లిన విదేశస్థులను వీరోచితంగా పోరాడి, విడుదల చేయించి 'పరమ వీర చక్ర' బిరుదు పొందుతాడు. ఆ ఆపరేషన్‌లో గాయపడ్డ తన మిత్రుడు బాలయ్య అప్పగించిన పనిని భుజస్కంధాల పై వేసుకొని, సైన్యం నుండి రిటైర్ అయ్యి ఇంటికి వస్తాడు. మిత్రుడికి మిలటరీలో రావల్సిన బాకీల నిమిత్తం ఎమ్మెల్యే సంతకం అవసరమై జ్ఞానేశ్వర రావు (అమ్రేష్‌పురి) దగ్గరకు వెళ్లి సంతకం పెట్టను నిరాకరించిన అతనికి ఎమ్మెల్యే బాధ్యతలు విడమర్చి చెప్పి సంతకం పెట్టించుకొని వస్తాడు. ప్రసాద్ బాబును కాపాడను స్మగ్లర్‌గా మారి వుండే శివాజీ (మోహన్‌బాబు) అనుకోని పరిస్థితుల్లో సీత (నగ్మా) ను పెళ్లి చేసుకొన్నా, హేమ (రమ్యకృష్ణ) తో కూడా కలసి తిరుగుతుంటాడు. ఎమ్మెల్యే పదవిని అడ్డుపెట్టుకొని సమాజాన్ని దోచుకోవాలని కొడుకుల వ్యాపారం కోసం మెడికల్, ఇంజనీరింగ్ కాలేజీలకు అనుమతి తెచ్చిన జ్ఞానేశ్వర రావుకు వ్యతిరేకంగా గుమ్మడి చేపట్టే వుద్యమంలోకి అనుకోని రీతిలో చంద్రకాంత్ ప్రవేశిస్తాడు. నీతి నియమంతో తన కుటుంబం నడుస్తుందని భ్రమ పడే చంద్రకాంత్ తన కొడుకు స్మగ్లర్ అని, కూతురు ఎమ్మెల్యే కొడుకు సాయికుమార్‌తో లేచి పోయిందని తెలిసి ఖంగు తింటాడు. కొడుకు శివాజీని ఇంట్లో నుండి తరిమి వేస్తాడు.

మారాలనే లక్ష్యంతో వెళ్లిన శివాజీ జ్ఞానేశ్వర రావు చీకటి వ్యాపారపు గుట్టును రట్టు చేసి, మిస్టర్ క్లీన్‌గా బయటకు రావడంతో మేజర్, మిలటరీ మిత్రుడు బాలయ్య కూతురు సీతతో సహా ఇంట్లోకి ఆహ్వానిస్తాడు. అన్యోన్యంగా సాగుతున్న చంద్రకాంత్ కుటుంబ నావ సావిత్రి (శారద)కి బ్లడ్ క్యాన్సర్ అని తెలువగానే సంక్షోభంలో పడిపోతుంది. హాస్పిటల్‌లో చేర్చిన భార్యకు మందులు తెస్తున్న చంద్రకాంత్‌కు అనుకోకుండా మిలటరీలో పనిచేసేటప్పుడు బంధించిన టెర్రరిస్ట్ (రాళీ) ఎదురు కావడంతో అతడ్ని వెంబడిస్తాడు హాస్పిటల్ ముసుగులో మూత్ర పిండాల వ్యాపారం చేస్తూ, పిల్లలను కిడ్నాప్ చేసి దాచిన ఎమ్మెల్యే, ప్రధాని కావడానికి వేస్తున్న ఎత్తులు తెలుసుకొంటాడు. హేమ ఈ వ్యవహారాన్నంతా సాహసంతో ఫోటోలు తీయడం చూసిన ఎమ్మెల్యే ఆమెను హతమారుస్తాడు. ఆమె తన మరణ వాంగ్మూలంలో ఈ కథంతా చెప్పినా కమిషన్ విచారణలో పోలీసులను, న్యాయాధికారులను ఎమ్మెల్యే కొని వేయడంతో మేజర్‌నే తప్పు పడుతుంది న్యాయస్థానం. ఈ దశలో చంద్రకాంత్ ఎమ్మెల్యేకి వ్యతిరేకంగా రాష్ట్ర వ్యాప్త మహిళా వుద్యమం చేపట్టి విజయం సాధించడంతో కథ ముగుస్తుంది.

చిత్రంలో సమకాలీన రాజకీయాల పై పలుసీన్లలో చంద్రకాంత్ మాటల రూపంలో చంద్ర నిప్పులు కక్కాడు. ప్రైవేట్ మెడికల్ ఇంజనీరింగ్ కాలేజీల సమస్యతో పాటు షేర్ మార్కెట్, స్విస్ బ్యాంకుల కుంభకోణాలు సారా వ్యతిరేక వుద్యమాన్ని పోలిన పిల్లల కిడ్నాప్ వ్యతిరేక వుద్యమం చూపారు. 'నా చీర లాగుతున్నారు మామ, అని ద్రౌపది నిండు సభలో పలికినా నేను చూడలేక పోతున్నాను కోడలా అన్న, ధృతరాష్ట్రుని చందాన' న్యాయ వ్యవస్థ వుందని విమర్శలు గుప్పించాడు. నేటి నేతలు 'బోలో స్వతంత్ర భారత్‌కి జై' అని బయట, 'ఛోంచేయ్ స్వాతంత్ర్య భారతాన్ని' అని లోపల భావిస్తున్నారు. బోఫోర్సు గన్నులను చూసిన కన్నులివి, కాశ్మీర్ కదులుతుందిరా అనే పదునైన ఈ టిల్లాంటి మాటలు పరుచూరి బ్రదరుల కలాల నుండి విరచిత మయ్యాయి. జాలాది, గురుచరణ్, రసరాజా ఒలికించిన సాహిత్యంలో 'సుఖీభవా సుమంగళీ', 'పుణ్యభూమి నా దేశం నమోనమామి' 'నీక్కావల్సింది నా దగ్గర వుంది' పాటలు బాగున్నాయి, వులికి పడకు అల్లరి మొగుడా పాటలో కళాదర్శకుడు భాస్కర్ రావు తన ప్రతిభ చూపాడు. కీరవాణి సంగీతం, విన్సెంట్, విజయ్ విన్సెంట్, కెమెరా ఫరవాలేదు. డి.ఎస్.కె. బాబు నృత్యం మామూలే. రాజా, పంబల్ రవి ఫైట్లు చప్పగా వున్నాయి. నటుల్లో ఎన్టీఆర్, మోహన్ బాబు తమదైన బాణీల్లో సాగారు. హీరోయిన్లు రమ్యకృష్ణ, నగ్మా పాటలకే పరిమితం. శారద, అమ్రేష్‌పురి, బ్రహ్మానందం, గుమ్మడి, పరుచూరి గోపాలకృష్ణ, బాబూమోహన్ నటన మామూలే. నెల్లూరు మాజీ మునిసిపల్ ఛైర్మెన్ టి. రమేష్ రెడ్డి కూడా చిత్రంలోని చివరి సీన్‌లో ఎమ్మెల్యేగా కనిపిస్తారు.

కథ, కథనం, నటన ఎలా వున్నా చాలా రోజుల తరువాత జనాకర్షణ గల ఎన్టీ రామారావు సాంఘిక చిత్రంలో కన్పించడం మోహన్‌బాబుతో పాటు భారీ తారాగణం చిత్రంలో వుండడం వల్ల సామాన్య ప్రేక్షకుల కళ్లన్నీ చిత్రం పైనే వుంటాయి.



# రావూస్ విద్యా సంస్థలు

ఫోన్: 363, వెంకటాచలం ~ ఎక్స్చేంజ్ ~ ఆఫీసు: 26046, 23781

## కోచింగ్ సెంటర్

వి.ఆర్.సి. ఎదురుగా, చాకలి వీధి, నెల్లూరు-1.

**గత 10 సంవత్సరాలుగా అత్యుత్తమ ఫలితాలందిస్తున్న విద్యా సంస్థ**

### సీనియర్ ఇంటర్

M.P.C. & Bi.P.C. (T.M. & E.M.) అడ్మిషన్లు జరుగుచున్నవి. క్లాసులు మే 10 నుండి ప్రారంభం.

### జూనియర్ ఇంటర్

M.P.C. & Bi.P.C. (T.M. & E.M.) అడ్మిషన్లు ఏప్రెల్ 19నుండి జరుగును. క్లాసులు మే 17 నుండి ప్రారంభం.

గత సంవత్సరాల వలనే ప్రతి సబ్జెక్టులోనూ కనీసం 25 యూనిట్ పరీక్షలు నిర్వహించబడును. సీనియర్ ఇంటర్ సిలబస్ సెప్టెంబర్ ఆఖరుకు పూర్తి చేసి అక్టోబర్ నుండి EAMCET కోచింగ్ ఇవ్వబడును.

NOTE : ముందుగానే అడ్మిషన్ తీసుకొని స్టడీ మెటీరియల్ పొందవచ్చును.

## రెసిడెన్షియల్ హైస్కూల్

## రెసిడెన్షియల్ కాలేజి

G.N.T. రోడ్డు, బుజబుజ నెల్లూరు, చెముడుగుంట పోస్ట్, (బాలాజీ స్టీల్స్ సమీపంలో)

గత పది సంవత్సరాలుగా అఖండ ఫలితాలను సాధిస్తూ అజేయంగా అడుగులు ముందుకు వేస్తోంది రావూస్ సంస్థ. ఇప్పుడు ప్రారంభిస్తోన్న 'రావూస్ రెసిడెన్షియల్ హైస్కూల్' విద్యా లోకంలో సరిక్రొత్త సూర్యోదయం.

1983 లో ఆరంభించిన 'రావూస్ కోచింగ్ సెంటర్' అనేక అనూహ్యమైన విద్యార్థుల విజయాలతో విజయ దుంధుభి మోగించింది. 1992లో బుజ బుజ నెల్లూరులో 'రావూస్ జూనియర్ కాలేజీ' గా రూపుదిద్దుకుని, తన స్థాయిని మరింతగా పెంచుకుంది. అదే ఉత్సాహంతో ఇప్పుడు కొత్తగా ఈ హైస్కూలుకు అంకురార్పణ చేసింది. విద్యార్థులు ప్రతిభా వంతులు కావాలంటే హైస్కూల్ స్థాయిలోనే బలమైన పునాదులు పడాలి. ఆ సదుద్దేశ్యంతోనే ఈ హైస్కూలు రూపకల్పన చేసుకుంది.

స్పేస్ టెక్నాలజీతో 21-వ శతాబ్దంలోకి అడుగు పెట్టబోతున్న బాల మేధవులకు స్వాగతం. స్టేట్ సిలబస్‌తో 6,7,8,9 మరియు 10వ తరగతులకు ఇంగ్లీషు మరియు తెలుగు మీడియంలలో అడ్మిషన్లు మే-1 తేది నుండి ప్రారంభం.



### మా ప్రత్యేకతలు

1. తక్కువ మంది విద్యార్థులు - ఎక్కువ శ్రద్ధ
2. వ్యక్తిగత పర్యవేక్షణ - క్రమ శిక్షణ
3. శుచి, శుభ్రత - రుచికరమైన భోజన వసతి
4. స్వతంత్ర ఆలోచనా ధోరణికి ప్రోత్సాహం.
5. జనరల్ నాలెడ్జి- స్పీడ్ టెస్ట్స్ - ఐ.క్యు టెస్ట్.
6. ప్రతిభా వంతులైన విద్యార్థులకు ఫీజుల్లో రాయితీలు
7. స్కాలర్ షిప్ సదుపాయం
8. బహుమతుల ప్రదానం
9. పరిశీలన పరిశోధన ప్రగతి
10. టెస్ట్ స్కోర్స్‌కు బిల్ పాకర్యం.

అప్లికేషన్ మరియు ప్రాస్పెక్టస్‌లకు రూ.25/- M.O.. & D.D. పంపి ఆఫీసునుండి పొందవచ్చును.

**అత్యుత్తమ శిక్షణ**
**అపూర్వ ఫలితాలు**
**ఆధునిక వసతులు**

జూనియర్ ఇంటర్ : M.P. & Bi.P. (T.M. & E.M.) లకు అడ్మిషన్లు ప్రారంభమైనవి. రూ.30/- M.O./D.D. పంపి అప్లికేషను, ప్రాస్పెక్టస్ పొందవచ్చును.

సీనియర్ ఇంటర్ : క్లాసులు జూన్ 1 నుండి ప్రారంభం.

Note : ఇతర కాలేజీలలో జూనియర్ ఇంటర్ చదివి సీనియర్ ఇంటర్ మా కాలేజీలో చేరుటకు ప్రవేశము కలదు.

Note : ఇంటర్‌లో మెరిట్ స్కాలర్ షిప్ ఇవ్వబడును.

ఫీజు వివరములు : ఇంటర్, ఎంసెట్- మెటీరియల్‌తో సహా శిక్షణ, వసతి భోజనము పర్యవేక్షణలో మొత్తం ఫీజు కేవలం రూ.15,000/- మాత్రమే. ఫీజు 3 వాయిదాలలో చెల్లించవచ్చును.

మెరిట్ విద్యార్థులకు రాయితీలు : 10వ తరగతిలో స్టేట్ ర్యాంకులో 10 లోపు ర్యాంకు పొందిన వారికి శిక్షణ, భోజనం, వసతి ఉచితం.
500మార్కులు సాధించిన విద్యార్థులకు రూ.2000/-.
450 మార్కులు సాధించిన వారికి రూ.1,500/-
400 మార్కులు సాధించిన వారికి రూ.1000/-
ఫీజులో మినహాయింపులు ఉంటాయి

## రావూస్ కోచింగ్ సెంటర్

17/584, రజక వీధి, నెల్లూరు -1
(ఫోన్స్ : 26046, 23781)

...ited. Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (P) Lt...